ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భగవతా ప్రసాదం

- ఎ.రామసుబ్బారెడ్డి

# భాగవత ప్రసాదం



ఎ. రామ సుబ్బారెడ్డి

# భాగవత ప్రసాదము

అనువాదం

ఎ. రామ సుబ్బారెడ్డి

శారీస్ ప్రచురణలు
చదిపిరాళ్ళ, కడప జిల్లా

సహకారం : విశ్వసాహితి

ప్రతులకు 1000

ప్రథమ ముద్రణ

1 ఆగస్టు 1996

ప్రతులకు :

సౌరీస్ ప్రచురణలు

చదిపిరాళ్ళ

కడప జిల్లా-516209

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.

—రచయిత



వెల రూ॥ 35/-

ముద్రణ :

ఎ-1 ప్రింటర్స్

మాణికేశ్వరి నగర్,

ఓ.యు. కాంపస్,

హైద్రాబాదు.

సహకారం :

విశ్వసాహితి

6-3-195,

న్యూ బోయిగూడ

సికింద్రాబాదు-3

# అభినందన

భాగవతము వేదసారము. అందుకే మహాభక్తుడైన పోతనామాత్యుడే

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మి చూలికైన
విబుధవరుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత దేటపఱతు' అన్నాడు.

మహాకవులకు కూడా సుబోధంకాని ఉద్గ్రంథం భాగవతం.

బ్రహ్మతత్వ నిర్ణేత అయిన వేదవ్యాస మహర్షి చిత్తశాంతిని ప్రసాదించిన దివ్యకృతి భాగవతం.

భక్తి వేదాంతతత్వ ప్రచారకులైన భాగవతోత్తములెందరు వివిన్న భాషలలో భాగవత కథాసుధను పంచిపెట్టారు.

శ్రీ చైతన్యుడు. వల్లభాచార్యుడు. సూరదాసు, తులసీదాసు, సమర్థ రామదాసు మున్నగు భాగవతోత్తములు భాగవతమును రచించారు.

మహాభాగవతోత్తముడైన పోతన మహాకవి 'జగద్ధితంబుగ' భాగవతమును రచించి, కడపజిల్లాలోని బంటిమిట్టలో వెలసిన శ్రీ కోదండ రామస్వామికి అంకితం చేసాడు.

గుజరాతీ భాషలో శ్రీ రామ చంద్రజీ డొంగరేశాస్త్రిగారు రచించిన మహా భాగవత వ్యాఖ్య హిందీలో 'భాగవత ప్రసాద్' గా సద్విచార్ పరివార్ ప్రచురించారు.

భాగవత తత్త్వార్థమును అతి సరళమైన శైలిలో రచించిన శ్రీ ..
హిందీ భాగవత వ్యాఖ్యాను, మిత్రులు శ్రీ ఎ. రామసుబ్బారెడ్డిగారు తేట
తెలుగులో పాఠకులకు అందజేయటం అత్యంత అభినందనీయం.

శ్రీ రామ సుబ్బారెడ్డిగారు హిందీ అధ్యాపకులు. భారత భాగవ
తేతిహాసములపట్ల అత్యంత శ్రద్ధాసక్తులు కలవారు.

ఇదివరలో శ్రీరామ, శ్రీకృష్ణ గాథలను తెలుగు పాఠకులకు
అందించి మన్ననలందుకొన్నారు.

భాగవతేతిహాసములోని సూక్తులను సరళమైన భాషలో పాఠకులకు
అందించినందుకు రామసుబ్బారెడ్డిగారిని మరోమారు అభినందిస్తున్నాను.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

బుద్ధపూర్ణిమ, కడప.

# సాభిప్రాయ సూచిక

మిత్రులు శ్రీయుతులు ఎ. రామసుబ్బారెడ్డిగారు అనువాదముచేసి తన అనువాద గ్రంథములవలన ఆ విషయములు మన తెలుగువారికి మనోవికాసము కలుగునట్లుగా చేసిన ఆయనకు మన తెలుగువారి తరపున కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను. నిద్దుర లేచినప్పటినుంచి ప్రొద్దుటంత వఱకు జరిగే దైనందిక జీవితంలో మానవత్వం లోపించి నిత్యం అపశృతులతో దద్దరిల్లే ఈ సమాజానికి ఆధ్యాత్మిక సంబంధిత గ్రంథము రచించుట హర్షదాయకము. ఈ గ్రంథము ఈ సమాజానికికూడా ఎంతో ఉపయోగకారికాగలదని భావిస్తున్నాను. అనువాదమనునది కత్తిమీద సాములాంటిది. అటువంటి అనువాదానికి పూనుకొని రచన సాగించి ప్రచురణగావించి లోకానికందించిన మిత్రులు శ్లాఘనీయులు.

ప్రముఖ యతీంద్రులు పూజ్యశ్రీ రామచంద్రజీ డాంగ్రే శాస్త్రిగారు ప్రసంగించిన ప్రవచనాలను గుజరాతీ భాషలో ప్రచురణ గావించగా వాటిని తెలుగు భాషలోనికి అనువాదము గావించిన మిత్రులు శ్రీయుతులు ఎ. రామసుబ్బారెడ్డిగారు అభినందనీయులు. భవిష్యత్తులో వీరు మంచి మంచి అనువాద గ్రంథాలను, స్వతంత్ర రచనలను గావించి సమాజాభివృద్ధికి పాటుపడగలరని సదా భగవంతుని ప్రార్థిస్తున్నాను.

—యాడికి శివ ప్రభాకర రెడ్డి
నిడిజివ్వి

# నా మాట

1984 నాటి మాట. నేను తాళ్ళప్రొద్దుటూరు నందు పనిచేసే రోజులు. ఒంగోలు సమీపాన దొడ్డవరప్పాడు గ్రామమున జనకమహర్షి లాంటి వ్యక్తి శ్రీ పాటిబండ్ల వేంకటేశ్వరరావుగారని తెలియచేశారు బృందావనవాసులు స్వామీ రామదాసుజీ మహారాజుగారు. దసరా శలవు దినాలలో వారిని దర్శించడము జరిగింది. ఎన్నడు ముక్కు మఖము ఎరుగని మమ్ము వారు ఎంతగానో ఆదరించారు. ఐదారు గంటలకాలం ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నాం. ఆయన గొప్ప రాజయోగి. భోజనానంతరము వెళ్ళివస్తామని చెప్పగానే చాలా తెలుగు హిందీ గ్రంధాలు నా చేతిలో ఉంచారు. అందులో "భాగవత్ రహస్య", 'భాగవత్ ప్రసాద్' ముఖ్యమైనవి. గుజరాతీ భాషలో శ్రీ రామచంద్రజీ డోంగరే శాస్త్రీ మహారాజ్‌గారి ప్రవచనాలను హిందీ రూపాంతరముచేసి ప్రచురించారు. సద్విచార్ పరివార్ అహమ్మదాబాదువారు. ఒంగోల్‌నుండి తాళ్ళ ప్రొద్దుటూరు చేరులోపల రెండువందల పేజీలు ఆ గ్రంథం చదవడము జరిగింది. ఆ వెనువెంటనే అనువాదమునకు శ్రీకారము చుట్టడము జరిగింది.

వేదాంత పరిభాషలోని కొన్ని పదాలకు అర్థము తెలియక స్వామీ రామదాసుజీ మహారాజుగారిని సంప్రతించడము జరిగింది. వారప్పుడు శ్రీ బృందావనము వదలి చెన్నూరు శ్రీ రాధా కృష్ణమందిరమున ఉంటూ

ఉండేవారు. ఆ మూలాగ్రము అనువాద ప్రతుల పరిశీలించి వారు తగు సూచనలు చేశారు. అందుకు వారికి నేనెంతో ఋణపడియున్నాను.

గ్రంథం ప్రచురించాలంటే ప్రచురణకర్తల అనుమతి కావాలి. సద్విచార్ పరివార్ వారు ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబివ్వలేదు. తుదకు శ్రీ రామచంద్రజీ మహారాజాగారు హైదరాబాదు ఫతేమైదాన్ నందు శ్రీ రామాయణ జ్ఞానయజ్ఞము నిర్వహిస్తున్నారని రేడియో వార్త విని హుటాహుటి వెళ్ళడము జరిగింది. బంజారాహిల్స్‌లో గొప్ప కోటీశ్వరుని కలుసుకొని అనుమతి నొసగమని ప్రార్థించాను. "వ్రాత మూలముగా ఎవ్వరికీ అనుమతించే అలవాటు లేదు. నా పలుకులే నీకు అనుమతియని" వారు గుజరాతీలో పలికారు. తీయని రసాలము ప్రసాదముగా నా కందించారు. వారికి సాష్టాంగ నమస్కారమాచరించి తిరిగివచ్చేశాను.

ప్రచురించాలని ఎంతగానో ఎన్ని విధాలుగానో ప్రయత్నించాను. కలానికి బలాన్ని ఒనకూర్చిన పరమేశ్వరుడు ధనలక్ష్మిని నాకు దూరము చేశాడు. ఐనా నిరుత్సాహ పడలేదు. కాలమే తీర్చుతుందనుకున్నాను తుదకు తి.తి దేవస్థానమువారు ముఖ్యముగా శ్రీ ఆకేపాటి చంగలరెడ్డి అధ్యక్షతనగల పుస్తక ప్రచురణ ఆర్థిక సలహా సంఘములోని సభ్యులు శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీ ఆశావాది ప్రకాశరావుగారు ఇత్యాది మేధావులు వ్రాతప్రతిని పరిశీలించి ప్రచురణకు ఆర్థిక సహాయమునకు అంగీకారము తెలియచేశారు. వారికి, వారి కార్యాలయ సిబ్బందికి కృతజ్ఞతలు చెప్పక తప్పదు.

ఈ గ్రంథం చదివి తమ అమూల్యమైన అభిప్రాయాలు అందచేసిన పూజ్యులు శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి, ప్రచురణలో కూడా

సహకరించిన డా॥ పోతుకూచి సాంబశివరావుగారికి, ఆత్మీయులు దరుడు చిరంజీవి యాడికి శివప్రభాకర్ రెడ్డిగారికి ధన్యవాదములు.

అనువాదము చేయడము కత్తిమీద సాములాంటిది. ఎంత జాగ్రత్త వహించినా, అక్కడక్కడ అక్షర దోషాలు దొర్లినాయి. మేధావులు దానిని పరిగణనకు తీసుకోరని మనవి. ఈ గ్రంథాన్ని సౌరీస్ ప్రచురణల రెండవ పుష్పముగా ఆస్తిక లోకానికందిస్తున్నాము.

**ఎ. రామసుబ్బారెడ్డి**

# మరో విన్నపము

నా సాహితీ విలువలు కడపజిల్లాకే పరిమితమై యుండగా, రాష్ట్ర స్థాయిలో సర్వులకు పరిచయము గావించినవారు, డా॥ పోతుకూచి సాంబశివరావుగారు. వారెంత విశాల హృదయులో కొలిచేదానికి కొలత బద్ద చాలదు.

ముఖ్యముగా నేను గత ఏడాది 1995 నవంబర్ మాసమున గుండె జబ్బుతో బాధపడుతూ హైదరాబాదునందు వైద్యం చేయించుకుంటూ ఉన్న సమయాన నా వెన్నుతట్టి గ్రంథ ప్రచురణ భారం తనపై మోపు కొని, ప్రతిదినం ఫోన్ద్వారా నా ఆరోగ్య పరిస్థితిని తెలుసుకునేవారు. వారందించిన సహాయ సహకారాలు మరువరానివి. మరపురానివి. అందుకే వారికి నా శతకోటి వందనాలు,

ఇంకపోతే భాగ్యనగరమందు నాకు ఆశ్రయమిచ్చి వైద్యానికి సకల సౌకర్యాలు కలిపించి, అనుక్షణం నాయందు శ్రద్ధ కనపరచి, దిగజారిపోయే నా ధైర్యాన్ని ఎగసన త్రోచినవారు శ్రీ జి. ఆర్. రెడ్డి ఐ.ఆర్.యస్. గారు, వారి సతీమణి డా॥ మాధవీరెడ్డిగారలకు కృతజ్ఞతలు చెప్పక తప్పదు. ఎందుకా ఈ గ్రంథ ప్రచురణలో వారూ చేయి కలిపారు కనుక ! ఈశ్వరుడు వారలకు ఆయురారోగ్యాలు ప్రసాదించు గాక..

ఇట్లు

**ఎ. రామసుబ్బారెడ్డి**

# రెడ్డిగారి కథలు దొడ్డ రచన

రామ సుబ్బారెడ్డి 'భాగవత ప్రసాదం' అనేక కథల, నీతుల, సూక్తుల మందిరం. ఒకసారి అందులోకి తొంగిచూస్తే ఆ అందాలు మనిషి మనసులో కలకాలం నిలిచిపోతాయి.

డోంగ్రేగారి గుజరాత్ రచనలు హిందీద్వారా తెలుగులోకి వచ్చినాక రెడ్డిగారు వాటి విశిష్టత నిలిపారు.

మేధావులు, విద్యార్థులుకూడా పఠించదగిన కథలు ఇవి. భాగవత సారాంశం జీర్ణించుకుని భగవద్గీతలా అందించిన యీ రచనలు అందరికి ప్రియం, హర్షణీయం.

రెడ్డిగారి రచన, శైలి, క్లుప్తత, భావ శబలత అందరినీ అలరిస్తాయి.

తెలుగు, హిందీ, ఆంగ్లం భాషలలో నిష్ణాతులై, సాహిత్యమే తన జీవిత లక్ష్యంగా సమరం సాగిస్తున్న సాహిత్యశ్రీ శ్రీ రామసుబ్బారెడ్డి ధన్యులు.

ఈ గ్రంథం అందరి ఆదరణ పొందాలని నా ఆకాంక్ష.

కళాప్రపూర్ణ

డా॥ పోతుకూచి సాంబశివరావు

చిరునామా :

విశ్వసాహితి, 6.3.195,

న్యూ బోయిగూడ, సికింద్రాబాద్. ఫోన్ : 823177

"ఏ గృహములో పేదసాదలకు సన్మానము జరుగుతుందో,
ఏ ఇంటిలో నీతియనేది నివాసం ఉంటుందో.
ఆ గృహము వైకుంఠముతో సమానము."

# 1. ఇంద్రియ మమకారము

ఇంద్రియాల ఇష్టానుసారముగా ప్రవర్తించిననూ, వాటికి పూర్తి స్వేచ్ఛనిచ్చిననూ, అవి తృప్తిపడబోవు!

నాలుకకు ఎంత స్వేచ్ఛనిచ్చిననూ, ఇంకా స్వేచ్ఛను కోరుతూనే ఉంటుంది.

జిహ్వాను ప్రసన్నం గావించుకునేందుకు కన్నులు మనస్సు తప్పు దారిలో పయనిస్తాయి.

'వ్యక్తి' ఆనందముకొరకు సినిమా లేక 'హోటల్' కు వెళ్ళడము జరుగుతుంది. కాని అక్కడ పొందిందేమిటి? కన్నులు, నాలుకను తప్పు దారి పట్టించడమే కదా?

పైసలు వెచ్చించి చీకటిలో మూడుగంటల కాలము గుంపుతో గడపడముచేత ఏ విజ్ఞానాన్ని ఆర్జించినట్లు?

సినిమా మనోరంజక సాధనముకాదు. అది మనస్సును పాడు చేయు మనోభంజక సాధనము!

సినిమా చూడడముతో మనస్సుకు విశ్రాంతి ఎక్కడిది? విపరీత మైన దుఃఖాన్ని అనుభవించవలసి వస్తుంది. అసత్యశృంగార దృశ్యాలు తిలకించడముతో వికారముచెందిన మనస్సు స్పర్శసుఖం కొరకు పిచ్చి దై పోతుంది. జీవిత పరమార్థాన్ని విస్మరించి వివేకాన్ని కోల్పోతుంది.

"కథా శ్రవణం చేశాక కొన్ని విషయాలనైనా కార్యరూపంలో దంచడం చెయ్యాలి. అప్పుడే కథా శ్రవణానికి సార్థకత"

## 2. ప్రమాదకరమైన చోరుడు

దారిలో పడిన ఎముకను చూచి ఎంతో జాగ్రత్తగా ప్రక్కకు వైతొలగిపోతాడు మనిషి! అశుభమని - అమంగళమని! కాని మాంస కండరాలచేత చర్మముచేత కప్పబడి ఎముకలగూటిని స్పర్శించుటకై ఎంతగానో చిందులు త్రొక్కుతాడు పిచ్చిగా!!

ఈ శరీరము వంకరతిరిగిన ఎముకలతో కూర్చబడి, మాంసకండ రాంతోను, నాడులతోనూ బంధించబడియుంది. సుందరమైన చర్మముతో పైకప్పు చేయబడి ఉంది.

ఈ శరీరమునుండి ఏ పదార్థము విసర్జింపబడిననూ చూచేదానికి మనస్సు ఇష్టపడదు. కానీ శరీర- స్పర్శకొరకు మనస్సు ఎంత పిచ్చిగా అర్రులు చాస్తుందో!

కనుక మదిలోనుంచుకో? దొంగకంటేగూడా ఇంద్రియాలు చాలా ప్రమాదమైనవి. ఇంటిలో దొంగ ఉన్ననూ అన్నిటిని దొంగలించలేడు. కాని ఇంద్రియాలు 'ఆత్మ' అనెడి ఇంటికి దూరమునుండి వివేకమనెడి 'ధనాన్ని' దోచుకొనిపోవడము జరుగుతుంది. పాతాళానికి త్రోయబడదము జరుగుతుంది.

అందుకని ఆత్మయందలి వివేకమనెడి ధనాన్ని దోచుకొనే ఇంద్రియాలగూర్చి జాగ్రత్తపడాలి.

"చనిపోక మునుపే వైరమును-వాసనలను
ఇక్కడే త్యాగంచెయ్యి !
లేకుంటే సద్గతి లభించదు !

## 3. సుఖము - శాంతి

జీవితమందు శాంతికి మహత్తు ఉంది. కాని సుఖానికిలేదు. అందు కని మనుజుడు తాత్కాలికముగా సుఖాన్ని వదలి శాంతిని పొందేటందు లకుని నిద్రను ఆశ్రయించడము జరుగుతుంది.

కాని ఈ నిద్రగూడా మనకు తెలిపేదేమంటే శాంతిసౌఖ్యాలు ఇహలోక సాధనలద్వారా లభించవు, మానవునియొక్క అంతః సమా ధానములచే లభించునని తెలియచేస్తుంది.

నిద్రతో మనకు కావలసిన ఆహారము- ధనము లభించదు. కాని అవి రెండు లేకుంటే మనిషికి ఏపని జరుగదు. ఏమీ చెయ్యబోలేదుకూడ!

నిద్ర అంతరికమైన ఆనందాన్ని ప్రదానము చేస్తుంది. అందుకని అందరకు నిద్ర అవసరము.

ఈ ఆనందము బాహ్య సాధనలచేత లభించదు. జీవితమున ఆనం దము- శాంతి, లభించాలంటే అంతర్ ముఖముగా మునకవేయవలసి ఉంటుంది.

ఎలాంటి సుఖాలను ఆశించక దృఢ- నిశ్చయముతో అంతర ముఖముగా మనస్సును మళ్ళించినవారికే అమితానందముతోపాటు శాశ్వత మైన శాంతిగూడా సంప్రాప్తిస్తుంది.

"ప్రేమ ఉన్నత స్థితికి తీసుకెళ్ళుతుంది.
కామము అధోగతికి చేర్చుతుంది."

## 4. సుఖము - దుఃఖము

సుఖదుఃఖాలు రెండు ఒకదానికొకటి ప్రతిబింబాలు. సుఖాన్వేషణకై బయలుదేరిన వ్యక్తులకు ఇంటిలోగిట్లోకి ఆహ్వానించకనే దుఃఖము ఆవరిస్తుంది. పరులకు సుఖాన్ని కలిగించేవారికి, స్వతఃగా దు-ఖాన్ని హిమము చేసేవారికి జీవితమందు నిజమైన సుఖం అనాయసముగా లభిస్తుంది.

బావిలోమునిగే ఏతపు లాగా, వెలుగు నీడల్లాగా సుఖదుఃఖాలు మానవ జీవితములో ఒకదానివెంట ఒకటి వస్తూపోతూ ఉంటాయి. అందుచేత సంసారిక సుఖాలవైపు మనస్సును మళ్ళించేబదులు ఆంతరిక సుఖాలు పొందేటందులకు శ్రమపడాలి. ఎందుకనగా అదే నిజమైన శాంతిని ప్రసాదిస్తుంది. "ఎంతవరకు సంసారిక సుఖాలవైపు అర్రులు చాచుతామో అంతవరకు అశాంతియనెడి నిప్పు రగులుకొంటూనే ఉంటుంది."

నిజమైన సుఖప్రాప్తికొరకు ఎక్కడో తిరగడము వ్యర్థమే! అది మదిలోనే లభించాలి. ఆంతరికమైన ఆనందమే శాశ్వతమైనది. వెలుపలి నుండి లభించే ఆనందము ఒక ఘడియ తరువాత దారుణమైన దుఃఖముగా మారిపోతుంది.

సంసారిక విషయ వాసనలతో ఆనంధాన్వేషణ చేయువాడు, చివరికి అత్యంత దుఃఖితుడగుచున్నాడు ఎందుకనగా వానివెంట భోగమనెడి క్షుద్బాధ అన్నిటికంటే దుఃఖహేతువు!

"ప్రేమతోకూడిన ప్రభుస్మరణ
మానవుని పరమాత్ముని చెంతకు చేర్చుతుంది."

## 5. వ్యర్థముగా తిరుగుట

ఆనందాన్ని పొందేటందులకు బాహ్యముగా తిరుగటచేత ఆనందానికి బదులు దుఃఖమే ప్రాప్తిస్తుంది.

నిర్మలానందముకొరకు ఆంతరంగిక దృష్టిని మళ్ళించవలసి ఉంటుంది.

ఇంద్రియాలను అంతర్ ముఖముగా మళ్ళించినచో ఆనందము లభిస్తుంది. ఒకవేళ బాహ్యదృష్టి మళ్ళించినట్లైతే ఆ సుఖము దుఃఖమందు ముగుస్తుంది.

బాహ్య సాధనలచేత ఆనందాన్ని పొందేటట్లయితే అజీర్ణరోగికి స్వాదిష్ట భోజనముతో అరుచి ఎందుకు కలుగుతుంది ?

ఎప్పుడైతే మనస్సు అంతర్ ముఖముగా తిరుగుతుందో అప్పుడే అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించడము జరుగుతుంది.

ఆత్మ స్వరూపములో స్థిరముగ నిలబడకలిగినవారే శాశ్వత శాంతిని, ఆనందాన్ని అనుభవించగలరు.

ఎంతవరకు సుఖ-దుఃఖాలు మనస్సుకు స్వభావిక ధర్మముగా నిలుస్తాయో, అంతవరకు ఆనందము ఆత్మయొక్క సహజధర్మముగా నిలుస్తుంది. అందువలన ఆనందాన్ని అనుభవించేదానికి ఇప్పటినుండే బాహ్యసాధనాలవెంట పరుగులు తీయడము మానుకోవాలి.

"ఎవ్వరైతే ఇతరుల సుఖాన్ని కోరుకుంటారో
వారిపై పరమాత్ముని చల్లని చూపులు నిలుస్తాయి."

## 6. మనసుచేసే మోసము

సుఖ-దుఃఖాలు అహంకార-మమకారాలచేతనే కలుగుతాయి.

పిల్లి ఇంటిలోని ఎలుకను పట్టుకపోతే మనిషికి బాధ కనిపించదు. కాని అదేపిల్లి పెంపుడు చిలుకను పట్టుకపోతే చాలా బాధ కలుగుతుంది. ఆ దినం భోజనంగూడా సహించదు మరి. దీనికి కారణం? చిలుకపై మనకుగల మమతానురాగాలు- తిష్ఠవేసుకోవడమే. కనుక అదే ప్రేమ ఎలుకపైలేదు మరి.

మనస్సు ఏమంటుంది? చిలుక నాది, ఎలుక కాదంటుంది. అనగా మదిలో అహంకారము-మమకారము ఉత్పన్నమై సుఖానుభూతి కలుగుతుంది. "ఎక్కడ మమత ఉంటుందో అక్కడ ఎంత శ్రమ కలిగిననూ కష్టమనిపించదు." కాని ఎక్కడ మమతానురాగాలు కరువైపోతాయో అక్కడ ఏ కొంచెం కష్టము కలిగినా సహించజాలము.

రాత్రి పదిగంటల సమయమున సాధువుకు భోజనము సిద్ధంచేసే ఓపిక లేనివాడు, రాత్రి పన్నెండు గంటల సమయములో స్నేహితుడుగా వచ్చిన వ్యక్తికి ఆదరముగా ఆహ్వానించి ఎంతో ప్రేమతో వంటచేసి విందారగింపచేయడము జరుగుతుంది? ఆ వచ్చిన వ్యక్తి తనకు ఆత్మీయుడు కావడమే మరి.

ఎట్టకేలకు మానవుని మనస్సు అహంకారము, మమకారము, అనే అడ్డుకట్టల నిలిపి వ్యక్తిని చెడుమార్గమున పయనించునట్లు చేస్తుంది.

"వాసనలే పునర్జన్మకు కారణాలు"

# 7. నాదవంశము

ప్రాచీన కాలమున శిష్యులకు నిస్వార్థ భావముతో విద్యాగరపడము జరుగుతూ ఉండెడిది.

నదీ-నదములవలె, చెట్లు-చేమలవలె గురుకులమందలి ఆచార్యులు ఏలాంటి ప్రతిఫలాన్ని ఆశించక అన్నపానాలనొసగి విద్యాదానము చేసే వారు.

అటువంటి ఆదర్శ గురుకులములందు విద్యార్జనచేసి ఇల్లుచేరు కున్న విద్యార్థులు గురువు ఋణమును తీర్చుకొనేదానికి గురుదక్షిణ నొసగేవారు.

ఆదేరీతిన గురుకులమందు విద్యార్జనచేసి శ్రీకృష్ణుడు వినయ విధే యలతో గురువుచెంత నిలచొని గురుదక్షిణ ప్రదానము చేసేదానికి అభిప్రా యము వ్యక్తపరుస్తాడు. అప్పుడు గురువు సాంధీపని మహర్షి కృష్ణుని దగ్గర చేర్చుకొని ఇట్లా అంటాడు— "నేనెంత ఓపికతో నిస్వార్థముతో మీకు బోధ గావించినానో అట్లానే నీవుగూడా లోభరహితముగా ఇతరు లకు విద్యాధనాన్ని దానముచేసి విద్యాభివృద్ధికి పాటుపడమంటాడు."

జగతిలో రెండు వంశాలు వ్యాప్తిలో ఉన్నాయి. ఒకటి పుత్ర వర ముగా బిందువంశము, శిష్యపరంపరగా నాదవంశము

కురుక్షేత్ర రణరంగమున విషాదముతో కర్తవ్యచ్యుతుడైన పార్థు నికి గీతబోధనచేసి, ఉద్ధవునికి ఉత్తమ ఉపదేశమొసగియు, శ్రీకృష్ణుడు నాదవంశాన్ని వృద్ధిగావించి నిజమైన గురుదక్షిణ తమ గురుదేవునికి చెల్లించడము జరిగింది.

"ఎవరి జీవితము దివ్యమౌతుందో.

వారు మృతులైన తరువాత దైవత్వాన్ని పొందుతారు."

## 8. అహంకారానికి చికిత్స

అహంకారము, మమతానురాగము, మానవుడిని చెడుమార్గమున నడిపించేందుకు సాధనాలు (పరికరములు)

మనస్సుకు ఈ పరికరాలను దూరముగా నుంచేటందులకు మార్గాలు రెండు. ఒకటి జ్ఞానమార్గము, రెండవది భక్తిమార్గము.

"సర్వస్వాన్ని త్యాగము చెయ్యి ! తనవారు నావారు అని ఎవ్వరిని అభిమానించకు. అందరియందును; ఉపేక్షాభావము కలిగియుండమని జ్ఞానమార్గము చెపుతుంది.

అది, ఆది అనేది ఎందుకు సర్వులలో సర్వేశ్వరుని దర్శించు. అందరితోను నిష్కామ భావముతో స్నేహం చెయ్యమని భక్తిమార్గము చెప్పుతుంది,

అంతేకాదు అర్థరాత్రివేళ ముక్కుముఖము తెలియని వ్యక్తి నీ గృహానికివస్తే వానిలోగూడా పరమాత్మ స్వరూపాన్ని తిలకించి ప్రేమతో సత్కారాలుచేసి నీసోదరునివలె భోజన సౌకర్యాలు కలిగించమంటుంది.

అట్లాచేస్తే నీ జీవితమున సుఖదుఃఖాల బీజారోపణ జరిగిననూ గుర్తించే అహంకార మమకారాలు పరిసమాప్తమౌతాయి.

"జిహ్వద్వారా ఎవ్వరైతే పాపాలు అధికముగా చేస్తారో
వారు మరుజన్మలో మూగవారిగా జన్మిస్తారు."

## 9. అనాసక్తి

"ఎప్పుడూ సత్కర్మ చెయ్యి. ఫలాపేక్ష కోరవద్దు" ఇది గీతోపదేశం.

ఈ ఉపదేశాన్ని శ్రీకృష్ణుడు నోటితో చెప్పడముకాదు. ఆయన తన జీవితమందు చేసి చూపించాడు.

శ్రీకృష్ణుని జీవితమార్గమును మనం అడుగడుగునా, పరీక్షించి చూస్తే మనకు బోధపడేదేమంటే. ఏ కోరికాలేకుండా సత్కార్యము చెయ్యడము ముఖ్యముగా తెలుస్తుంది.

కంసవధానంతరము ఆయన అనుకుంటే మధురానగరి సింహాసనమే లభించేది. కాని ఆయన అట్లా చెయ్యలేదు. రాజ్యాభిషేకాన్ని, రాజ్య సింహాసనాన్ని తిరస్కరించి కంసుని తండ్రి ఉగ్రసేన మహారాజునకు రాజ్యాధికారాన్ని అప్పగిస్తాడు.

ఎంతటి అనాసక్తి ?

ఆయన కంసుని వధించడము రాజ్యాన్ని అనుభవిస్తామని కాదు, ప్రజల బాధల రూపుమాపేటందులకే !

"ప్రభువుకొరకు, పరోపకారము కొరకు
ఎవ్వరైతే శోధిస్తారో
వారి జీవితములో ఏడ్పుకు చోటెక్కడిది ?"

## 10. జ్ఞానమార్గము - భక్తిమార్గము

పరిపూర్ణ వైరాగ్యము కలిగితే జ్ఞానమార్గ సాఫల్యము దక్కుతుంది. సంపూర్ణమైన సద్భావన కలుగుతే భక్తిమార్గములో సఫలత కలుగుతుంది.

జ్ఞాని తనకు కష్టసుఖాలు కలిగిననూ ఇతరులకు కలిగిననూ బాధపడడముగాని, లేక సంతోషించడముగాని చెయ్యడు. ఎందుకనగా సృష్టిలోని ప్రతిదానిపైన మమకారాన్ని వదలడముచేత అన్నిటియందు సమభావాన్ని కలిగియుండుటవలననూ ఆనందాన్ని పొందుతూ ఉంటాడు.

భక్తుని మనస్సు దీనికి విరుద్ధముగా ఉంటుంది ప్రతి ప్రాణిలోను భక్తుడు దైవాన్ని చూస్తూ ఉంటాడు. అందుచేత అందరి సుఖ-దు-ఖాలు తనవిగా భావిస్తాడు. అందరిలోను తన దైవాన్ని ఆరాధిస్తూ ఆనందిస్తూ ఉంటాడు.

ఐతే సామాన్య మానవులకు జ్ఞానమార్గము కఠినముగా ఉంటుంది. ఎందుకనగా త్యాగాన్నిగూర్చి వక్కాణించడము చాలా తేలిక. కాని ఆచరణలో నుంచడము చాలా కష్టము, అందుచేత అందరిలో పరమాత్మ ఉన్నాడని అందరియందును సమభావము కలిగియుండడము ఉత్తమమైనదని తెలిపే భక్తిమార్గమే శ్రేష్టము.

"నిరాధారులకు చేయూత నియ్యి.

సదాచారులకు సహకారమియ్యి."

## 11. ఉత్తానపాదుడు

ఉత్తానపాదునకు ఇద్దరు రాణులు. 'సురుచి' రాజుకు ప్రేమ పాత్రురాలు, 'సునీతి ఉపేక్షితురాలు.

ఒకరోజు ఉత్తానపాదునకు 'సురుచి' కుమారుని తన అంకమున కూర్చుండబెట్టుకొనడము జరుగుతుంది. అదే సమయములో 'సునీతి' కుమారుడు "ధృవుడు" కూడా తండ్రి తొడపై కూర్చుండబోతాడు. సురుచి మందలిస్తుంది. తల్లి 'సునీతి' ఆజ్ఞానుసారము ధృవుడు అడవికివెళ్ళి తపః శక్తిచేత ప్రభు సాక్షాత్కారము పొందుతాడు.

ఈ ఉత్తానపాదుడు మరెవరోకాదు, తల్లిగర్భాశయములో కాళ్ళను పైకి, తలను క్రిందికి ఉంచి నిద్రించే ప్రాణి !

'సురుచి'- అనగా ఇంద్రియాలద్వారా అనుభవించే భోగం. 'సునీతి' అనగా కోరికలను అదుపులో నుంచుకొను శక్తి స్వరూపము !

ఉత్తమ (ఉద్+తమ్) అనగా ఈశ్వరునిచే వంచింపబడిన విషయానందము. జీవునికి రుచి ఇష్టం. కాని నీతి అనగానే సరిపడదు. అందుచేత ఇంద్రియ ప్రవృత్తిచేత ప్రాప్తించిన విషయానందములో లీనమౌతుంది. నీతి-నియమము, నిగ్రహ జీవనముద్వారా ప్రాప్తించగల బ్రహ్మానందాన్ని ఉపేక్షించడము జరుగుతుంది. తుదకా జీవుడు జననమరణ మనే చక్రములో పడిపోతాడు.

"చమటోర్చి పనిచేసినపుడే పరమాత్ముని
ప్రేమకు పాత్రులమౌతాము"

## 12. అందరియందు ప్రేమ

శ్రీకృష్ణ భగవానుడు సర్వులను ప్రేమగా చూడడము గొప్ప విశేషము. ఆయనను ప్రేమించేవారియందును, సేవించేవారియందు ఆదరాభిమానాలు చూపడము స్వభావికం. కాని ఆయనకు విషాన్ని కుడిపించిన 'పూతన' యందు, దూషించిన శిశుపాలునియందు,ఎదపై కాలితొ తన్నిన బృగు మహర్షియందును, అమితమైన స్నేహభావము కలిగియుండడము గొప్ప విశేషముకదా ?

బృగు మహర్షి కోపతాపాలతోవచ్చి ఎదపై తన్నిననూ, తన్నిన మహర్షి కాలును ప్రేమతో పట్టుకొని— "నా వక్షస్థలము చాలా కఠోర మైనది. మరి మీపాదము చూస్తామా ఎంతో కోమలమైనది. నన్ను మీరు తన్నడముచేత మీ పాదానికి చాలా కష్టము కలిగియుంటుంది. అందుకని నాకు చాలా దుఃఖముగా ఉంది"— అని అంటాడు భగవానుడు.

ఎంతటి పవిత్ర భావం !
అందరియందును ఎంత సమభావం !
ఎదపై తన్నినవారికి హృదయములో సద్భావము కలుగుతుంది.
అప్పుడు భక్తి పెరుగుతుంది.
అప్పుడే జీవితానికి శాంతి దొరుకుతుంది.

"శ్రవణశక్తిచే పాపాలు భస్మమౌతాయి.
మదిలోని మైల తొలగిపోతుంది
పరమాత్మనివైపు మనస్సు పరుగులుతీస్తుంది"

## 13. గురు - శిష్యులు

సాందీపని మహర్షి గురుకులమందు విద్యార్థులు అనేకమంది ఉండే వారు. కానీ శ్రీకృష్ణుడు సుదామునితో స్నేహము చేస్తాడు.

సుదాముడనగా సుయోగ్యమైన ఇంద్రియము కలవాడని....

ఇటువంటి యోగ్యతగల సుదామునితో మైత్రిచేసిన శ్రీకృష్ణునివలె మనముకూడా ఆచరించడము శ్రేయస్కరము.

ఎవ్వరైతే బాల్యదశనుండియూ నిగ్రహశక్తిని కాపాడగలుగుతారో. అట్టివారి జీవితములో "విద్య" స్థిరముగా ఉంటుంది.

ఎప్పుడైతే విద్యార్థి సుఖార్థియై విలాసవంతుడౌతాడో అప్పుడు విద్య భస్మమౌతుంది, "నేటి విద్యాలయాలు, విద్యాలయాలు కావు. అవి విలాస మందిరాలు" అని చెప్పక తప్పదు.

వేదాంతాన్ని బోధించే ఆచార్యులు సిగరెట్ కాల్చుతూ ఉంటే— విద్యార్థులను ఎట్లా సంస్కారవంతులుగా చేస్తారు?

ఆచార్యుల విలాస జీవితము- ప్రతిదీ అనుకరించే శైశవ దశలోని విద్యార్థుల భావి జీవితముపై ప్రభావము తప్పక చూపుతుంది.

అందుచేత చెప్పవచ్చేదేమంటే— ఎవ్వరైతే త్రికరణశుద్ధిగా ఆచరించి ఉపదేశిస్తారో వారే నిజమైన గురువులు. ఆచరణలేక ఆజ్ఞాపించేవారు గురుపదవికి అనర్హులు.

"ఇతరుల సుఖాలలో పాలుపంచుకోవడం నేర్చుకో"

# 14. భక్తి

జీవితములో భక్తిని అలవరచుకోవాలని ఉంటే, నీవు అందరిని ప్రేమించడము నేర్చుకో ?

జ్ఞానాన్ని వృద్ధిచేసుకోవాలనుకుంటావా సర్వస్వాన్ని త్యాగము చెయ్యి ?

అందరిని ఆదరాభిమానాలతో ఆదరించేవారు అందరిలో పరమాత్మను దర్శించేవారి భక్తి సార్ధకమవుతుంది.

అరటిపండుపై గల తోలు (తొక్క) నిస్సారమైనదని పారవేయడము జ్ఞానమార్గము. కాని ఆతోలుగూడా ఉపయోగపడుతుందని భావించి ప్రేమ భావముతో ఆవుకు తినిపించడము భక్తిమార్గము.

నిరుపయోగమని అరటిపండు తోలును విసిరిపారవేస్తే కాలుజారి ఎవరైనా పడిపోవడము జరుగుతుంది. ఐతే దయతో ఆవుకు తినిపించడముచేత 'పాలు' గా రూపాంతరముచెంది జీవితాన్ని పోషించేందుకు వినియోగపడుతుంది.

ఈ రీతిన జ్ఞానమార్గములో అభిమానముతో అప్పుడప్పుడు జారిపడడము జరుగుతుంది. కాని భక్తి మార్గములో ప్రేమాభిమానాలతోపాటు ఆనందానికి ఆనందమూ తోడౌతుంది.

ఒక్కక్షణంగూడా పరమాత్ముని వదలి ఉండక హృదయాన్ని ఎప్పుడూ ప్రపత్తిప్రేమలో ముంచియుండడము నిజమైన భక్తి !

"విషయవాసనలను త్యాగము చేసినపుడే—
బ్రహ్మానందము అనుభవములోనికి వస్తుంది."

## 15. జ్ఞానము - ప్రభు ప్రేమ

గోపికలకు ఉపదేశమిచ్చుటకు శుష్కజ్ఞానియైన ఉద్ధవునితో శ్రీకృష్ణుని ప్రేమ పాత్రురాలగు రాధిక ఇట్లా చెప్పుతుంది— "అయ్యా ఉద్ధవా? ఆరుశాస్త్రాలు, నాలుగు వేదాలు చదివిన తరువాతగూడా నీవు సంశయపడతావెందుకు? నీ శ్రీకృష్ణుడు కేవలము మధురానగరిలోనే ఉన్నాడు, నా కృష్ణుడు ఇచ్చటగల చెట్టుచేమలలోని రోమ రోమమునందు నిండియున్నాడు. మరి మధురానగరిలోని కృష్ణునితో నాకేంపని?

అప్పుడు ఉద్ధవుడు ఇట్లా అనుకుంటాడు. "నేను చిలుకమాదిరి అద్వైతాన్ని పఠించాను. ఐతే గోపికల ఏ అధ్యయనము లేకయే అద్వైతానుభూతిని సంపాదించారు."

అప్పుడు ఉద్ధవుడు గోపికల చరణాల స్పర్శించి కరుణా పూర్ణ స్వరముతో "నాపై కరుణించి నా హృదయాన్నిగూడా శ్రీకృష్ణ ప్రేమలో మునిగేటట్లు చెయ్యండి"— అని పలుకుతాడు.

ప్రభుప్రేమ లేనిదే జ్ఞానం - ధ్యానం వ్యర్థం.

జ్ఞానఫలము భ్రమను తొలగిస్తుంది.

ప్రభుప్రేమ ఫలితమే పరమాత్మ ప్రాప్తి కలిగిస్తుంది.

పరమాత్మని పొందలేని 'జ్ఞానము, భక్తి' వలన ప్రయోజ మేమిటి!!

"ఎవరి జీవితము ఆడంబరహితమో-
అతడే నిజమైన సాధువు."

## 16. ముల్లును ముల్లుతో తొలగించు

కపిల భగవానుడు తన తల్లి దేవతో ఇట్లా అంటాడు— "అమ్మా ప్రపంచము ఏమీచెడ్డదికాదు. కాని ఈ ప్రపంచాన్ని చూసే మన మనసు చెడిపోయింది."— అని అంటాడు.

ముందు మన మనస్సును బాగుపరచుకుంటే ప్రపంచములో మన దృష్టికి ఏ దోషము కనిపించదు.

లౌకికవాసనలచేత పాడైపోయిన మనస్సు అలౌకిక వాసన అనెడి వలలో చిక్కుకొని బాగుపడుతుంది.

ప్రాపంచిక పదార్థాలచే పొందే వాసనలను, లౌకిక వాసనలనియు, పరమాత్మను పొందాలనే వాసనలను అలౌకిక వాసనలనియు అంటారు.

హృదయమందు ప్రభువును సాక్షాత్కరించుకోవాలనుకోవడము, స్థిరముగా నిలుపు కోవాలనుకోవడమనే వాసన పుట్టుకవస్తే, ప్రాపంచిక వాసనలు నిశ్చయముగా నశించిపోతాయి.

అందుచేత మరలా ఒకమారు చెప్పడము ఏమనగా— "లౌకిక వాసన అనెడి ముల్లును, అలౌకిక వాసన అనే ముల్లుతో తొలగించవలసి ఉంటుంది.

కనుక మదిలో నీవు అలౌకిక వాసనలను నింపుకో? లౌకిక వాసనలు వాటంతట అవే అనగారిపోవడము జరుగుతుంది.

"శరీరము మృత్యువాతపడగానే ముక్తి లభించదు-
మనస్సు మృత్యువాత పడినప్పుడే ముక్తి ప్రాప్తిస్తుంది."

## 17. ఆశీర్వాదము

కోరితే దొరికేదికాదు ఆశీర్వాదము. పెద్దలను సేవించడము వారినిసంతోషపరచి, వారి హృదయాల ద్రవీభూతము చేసినపుడే ఆశీర్వా, దము ప్రాప్తిస్తుంది.

ద్రవీభూతమైన హృదయముతో గురుజనులనుండి వచ్చేవాక్కు. శుభమును కలిగిస్తుంది.

సాందీపని మహర్షి గురుదక్షిణ రూపములో విద్య అనెడి వంశాన్ని వృద్ధి చెయ్యమని అడుగుతాడు శ్రీకృష్ణున్ని. కాని గురుపత్ని ఆకాంక్ష ఏమి టంటే— "సాగరమున మునిగి చనిపోయిన పుత్రుణ్ణి పునర్జీవితుడినిచేసి బిందువంశాన్ని ఉద్ధరించమంటుంది. వెంటనే శ్రీకృష్ణుడు సముద్రము చెంతచేరి గురుపుత్రుడిని తల్లిచెంతకు చేర్చుతాడు. బాలుణ్ణి గురుపత్ని ముందు చేర్చినపుడు కృష్ణుడు చూపిన వినయ-విధేయతలు, చూసి గురుపత్ని ద్రవీభవించిన హృదయముతో— "శ్రీకృష్ణా సర్వదా నీకు విజయము వరిస్తుంది. నేను ఆశీర్వదిస్తున్నాను, నీ ఇంటిలో లక్ష్మి, నీ జిహ్వపై సరస్వతి, జగత్తులో నీ కీర్తి పెరుగుతుంది"— అని ఆశీర్వ దిస్తుంది.

హృదయపూర్వకముగావచ్చే ఆశీర్వాదములు ఇట్లా లభిస్తాయి. ఇలాంటి ఆశీర్వచనాలే ఫలిస్తాయి కదా!

"మనస్సు మృత్యువాత పడడమే మోక్షము"

# 18. మంత్రము - యంత్రము

మనస్సు నీరులాంటిది
ఏ ప్రకారముగానైతే నీరు ఘట్టినుండి పల్లానికి జారుతుందో
అలాగే మనస్సు ప్రాపంచిక విషయాలచే
ఆకర్షింపబడి పతనమార్గమువైపు పయనించడము
ఇష్టపడుతుంది.

నీటివలెనే మనస్సుగూడా తుచ్ఛమైన సంసారిక విషయాలలో కొట్టుకపోయే సంపదకొరకు యోచించుతూ ఉంటుంది.

ఈ అలవాటే పాపకర్మలవైపు ప్రేరేపించుతుంది. ఎప్పుడైతే మదిలోని ఈ అలవాటు నశించి ఊర్ధ్వముఖముగా ప్రేరేపించబడుతుందో, అప్పుడే జీవితానికి శాంతి, సంతోషాలు వల్లవిస్తాయి.

ఐతే మనస్సును ఊర్ధ్వముఖముగా త్రిప్పడము ఎట్లా ?

క్రిందికి పారేనీటిని యంత్రముద్వారా నిరోధించినపుడు నీరు పైకి చేరుతుంది. ఈరీతిన పతనావస్థనందున్న మనస్సుకు పరమాత్మ యనెడి మంత్రము దొరుకునో అప్పుడు మనస్సు ఊర్ధ్వగామియై ప్రభు సన్నిధిని చేరుకుంటుంది.

అందుకని మనస్సును ఎల్లవేళలా మంత్రముతో ప్రభునామ స్మరణలో నిమగ్నము చెయ్యి ? అప్పుడు పరమాత్మ సన్నిధికి చేరేటం దుకు శక్తి ద్విగుణీకృతమౌతుంది.

అనేక పుస్తకాల చదివి మస్తకాలు పాడుచేసుకున్ననూ, అనేక తీర్థయాత్రలు సలిపిననూ 'మనస్సు' బాగుపడదు. మనస్సును మంత్ర ముతో స్నేహము చేయించినపుడే బాగుపడుతుంది.

"ఎక్కడ బేదభావాలుంటాయో
అక్కడే భయభీతులు కనిపిస్తాయి."

## 19. కంసుడు

మధురానగరము ఎంతవరకు కంసుని ఆధిపత్యము క్రింద ఉందో, అంతవరకు అక్కడి ప్రజలకు సుఖ-శాంతులు లేవు.

ఈ పీడిత జనావళికి సుఖ-శాంతులు కలిగించేటందులకు శ్రీకృష్ణుడు కంసుని వధించడము జరిగింది.

ఈ కంసుడు ఎవ్వరు ?

అస్తి, ప్రాప్తి- అనే పేరుగల ఇరువురి పత్నులకు పతి కంసుడు.

అస్తి అనగా బ్యాంక్ (ధనాగారము) లోని బేలెన్స్ అని అర్థము. ప్రాప్తి అనగా సంపాదన అని అర్థం.

"నావద్ద ఎంత ధనమున్నది ? దీన్ని పెంపొందించేటందులకు ఇంకా సంపాదించాలి"— అనే ఆలోచన ఎవరి మనస్సులో సర్వదా ఉంటుందో అట్టి 'లోభి' ధనార్జనకొరకు న్యాయన్యాయాలని విచారించని వ్యక్తినే "కంసుడు" అని చెప్పుతారు.

'కం'- అనగా సుఖమని 'స' అనగా సంహరించడమని అర్థము.

ధనార్జనకొరకు, ధనాన్ని వృద్ధిచేసేటందుకు దుర్మార్గాన్ని ఆచరించుతూ తన సర్వసుఖాలను స్వయముగా నాశనము చేసేవాడే "కంసుడు."

అటువంటివాని జీవితములో శాంతి దుర్లభము. ఎందుకనగా వాని జీవితమున అశాంతి జన్మిస్తుంది.

"మనస్సును ప్రభుప్రేమలో విలీనము చెయ్యి.
మనస్సు చనిపోతుంది. జీవితము తరిస్తుంది.

## 20. వాసన

ఇష్టమొచ్చినట్లు భోగాన్ని అనుభవించినా, తృప్తి ఉండదు.

ఏయే భోగాలననుభవిస్తామో, ఆయా వాసనలు పెరుగుతూ ఉంటాయి.

అగ్నికి ఆహుతి ఇచ్చేకొలది ఎట్లా శాంతించదో అట్లానే భోగాలను అనుభవించిననూ వాసనలు శాంతించవు.

వివేకము నిగ్రహము కలిగినపుడే వాసనలు రగులుతూనే ఉంటాయి. భోగాలు అనుభవించడము మానుకుంటే వాసనలు వాటంతటవే దూరమౌతాయి.

అందుకని ఇప్పటినుండే వాసనలకు భోగాలనందించడము నిరోధించి వివేకముతో నిగ్రహము కలిగియుండి శాంతిని పొందే సంకల్పము నింపుకో ?

- o -

"ఎవని తలలోనైతే భగవానునికి బదులు
అభిమానం ఉంటుందో వాడు చాలా
దుఃఖితుడౌతాడు."



## 21. కర్మభూమి

ధనముచేతగాని అధికారముచేతగాని శాంతి లభించదు. సమత, సంతోషము, స్నేహముద్వారా ప్రభువును దర్శించితే శాంతి ప్రాప్తిస్తుంది పరమాత్మ దర్శనము మానవశరీరముతోనే లభిస్తుంది. పశుశరీరాలకు లేక దేవతాశరీరాలకు ఈ అదృష్టములేదు.

పశువులకు జ్ఞానములేదు. కనుక ఆ దౌర్భాగ్యజీవులు ఏమిచేస్తాయి ? బుద్ధి ఉండి పుణ్యఫలముచేత సర్వసౌఖ్యాలు అనుభవించే దేవగణానికి గూడాపరమాత్మ దర్శనము దుర్లభము.

దానికి కారణము. స్వర్గము కేవలము భోగభూమి కావడమే ! చేసిన పుణ్యఫలము అక్కడ వ్యయముకావడము జరుగుతుంది. కాని నూతనముగా సత్కర్మ చేసే అవకాశము మృగ్యము.

భరతభూమి కర్మభూమి ! ఇక్కడ మానవులు సత్సంగము, సత్కర్మ, లేక నామ సంకీర్తనలద్వారా పరమాత్మను పొందుతారు.

అందుకే స్వర్గములోని దేవతలుగూడా భరతభూమిలో జన్మించే దానికి అహర్నిశలు అర్రులు చాచుతారు.

"సంసారిక కార్యక్రమాలలో సతమతమౌతూ ఉన్ననూ

మనము భగవంతుని మరువకూడదు.

సర్వదా ఈ విషయాన్ని మదిలోనుంచుకో."

## 22. పైసాకాదు - కావలసింది ప్రేమ

హిరాణ్యాక్షుడనగా, అర్థం సువర్ణంపై దృష్టిని ఉంచిన లోభియని అర్థము.

నేత్రాలయందు వాత్సల్యం ఉందుకో? పైసలుకాదు. నయనాలతో అమృతాన్ని కురిపించాలి.

ఎవ్వరి నయనాలలో ధనము తిష్టవేసుకొని ఉంటుందో, వాడు చాలా పాపము చేస్తాడు. ఎందుకనగా పాపానికి తండ్రి లోభంకనుక!

లోభం దినదినమూ పెరుగుతూపోతుంది. లాభముపొందేకొలది లోభము సంతోషపడదు.

లోభి దైవమందిరము వెళ్ళినా వానిదృష్టి కేవలము ధనముపైననే ఉంటుంది

దృష్టిలో ధనాన్ని ఉంచుకోవడము, చాలా పాపము. భూమాత రసాతలానికి చేరుకొంటుంది. అందుకని నయనాలతో చూడవలసింది, ధనాన్నికాదు— వాత్సల్యం !!

"నివృత్తి నిర్వర్తించేటపుడు ధర్మాన్ని విస్మరించకు"

## 23. సత్కర్మ - సద్భావము

సద్భావముతో సత్కర్మచేస్తే శాంతి ప్రాప్తిస్తుంది. ఎవ్వరైనా చెడుతలంపుతోచేసిన సత్కర్మ దుష్కర్మగా పరివర్తన చెందుతుంది.

సత్కర్మవెంట అత్యంత సద్భావము ఉంచేనే ఫలితము దక్కుతుంది.

ఈశ్వరారాధన తరువాత విశ్వశ్రేయస్సు కొరకు సద్భావముతో ప్రార్థనచేస్తే పరమాత్ముడు సంతోషిస్తాడు. పిల్లల క్షేమము నీవు కోరితే, ఈశ్వరునకు కోపము ఎందుకుంటుంది ? కాని నీ శత్రువుల పిల్లలగూర్చి చెడుగా యోచిస్తే మాత్రము పరమాత్మ తప్పక కోపిస్తాడు.

కారణమేమంటే పిల్లలు ఎవరిపిల్లలైనా, పరమాత్మ స్వరూపులే కనుక !

మనము ఈశ్వరుని ఎదుటనే ఈశ్వర స్వరూపులైన పిల్లల చెరుపునుకోరితే పరమాత్ముడు ఎట్లా సహిస్తాడు ?

ఇతరులకు కీడు కలగాలనిచేసే ఏ సత్కార్యమైనా సత్ఫలితానికి బదులు దుష్ఫలితాన్నే ప్రసాదిస్తుంది— దక్షుడుచేసిన యజ్ఞములాగ !

"పండితుడైనా జ్ఞానియైనా శాంతి దొరకడము దుర్లభము",
భక్తిలో నిమగ్నమైనపుడే శాంతి లభిస్తుంది."

## 24. నేత్రాలు - మనస్సు - జీవితము

ఎవరి నయనాలు చెదిరిపోతాయో వారు సర్వస్వాన్ని పోగొట్టుకుంటాడు. పాపమునకు అంటుతూ ఉందంటే అది నేత్రాల ద్వారానే మదిలో ప్రవేశిస్తుంది. తరువాత వాక్కులో కలిసిపోతూ ఉంది. ఆ తరువాత చేష్టల్లో ప్రతిఫలిస్తుంది.

నేత్రాలు భ్రష్టత్వము చెందితే మనసు పాడైపోతుంది. మనసు పాడైపోతే జీవితముగూడా చెడిపోతుంది.

రావణుని నేత్రాలలో కామము ఉంది. హిరణ్యాక్షుని కన్నులలో లోభము చోటుచేసుకుంది. అందుచేత వారి మనస్సు చెడిపోయింది. జీవితము వ్యర్థమైంది పేరు పాడైపోయింది.

రావణుడని. హిరణాక్షుడనే పేరు తమ బిడ్డలకు ఎవరైనా పెట్టుకున్నారా ? అట్లా పిలిచేదానికి సిద్ధంగా ఉన్నారా ?

హిరణాక్షుడు భూమండలాన్నే కాదు, స్వర్గాన్ని గడగడలాడించినవాడు. కాని అతని పాలనలో ప్రజలు చాలా కష్టపడ్డారు.

అనేక పాపాలుచేసిన లోభియైనరాజు రాజ్యపాలనచేస్తే ప్రజలు అత్యంత దుఃఖాన్ని అనుభవిస్తారు.

అటువంటి హిరాణ్యాక్షులు మనదృష్టిలో పడకూడదు. జీవితమున ప్రవేశించకూడదు. వివేకముతో "ప్రవేశము"— అనే బోర్డు తగిలించి జీవితాన్ని సంతోషసాగరముగా మలచుకో ?

"ఎవ్వరైతే సుఖాన్ని అనుభవిస్తారో—
వారు దుఃఖాన్నిగూడా అనుభవించవలసి-
ఉంటుంది.

## 25. సద్గురు శరణు

సద్గురువుద్వారా మనకు దీక్ష లభించినంతవరకు జీవితము పవిత్రము కాలేదు.

పరమాత్ముడుకూడా మనిషిగా జన్మిస్తే దీక్షపూనేటందులకు సద్గురు శరణు కోరుతాడు.

సద్గురువు, సంసార సాగరములో మాయారూపములోని మకరి బారినుండి మనిషిని ఉద్ధరిస్తాడు.

నేడు అలాంటి సద్గురువులను ఉపేక్షించడము జరుగుతూ ఉంది. కేవలము పుస్తకాలు చదివి మనుజులు తమ మస్తకాలను ఖాళీ చేసుకుంటున్నారు.

పుస్తకాలయందలి జ్ఞానాన్ని సంపాదించి స్థిరముగా ఉంచుకోవాలన్నా, సద్గురువుయొక్క కృప ఉండాలి.

ప్రయత్నించి సాధించిన జ్ఞానము అభిమానాన్ని పెంచుతుంది. వ్యక్తిని చెడుమార్గాన మళ్ళిస్తుంది. కాని సద్గురువు కృపద్వారా లభించిన జ్ఞానము మనల వినయము, వివేకము, సద్గుణము, సదాచారమువైపు తీసుకెళ్ళుతుంది.

జితేంద్రియుడు, సర్వజ్ఞుడునూనైన సద్గురువు సంచరించేచోటు జ్ఞానతీర్థముతో సమానము. నేటి సమాజమందు అలాంటి సద్గురువు లభించనిచో ప్రాచీన మునీశ్వరులను, జ్ఞానులను, సద్గురువులుగా భావించి సత్వరమువారి శరణు వేడుకొనుము.

"నేను ఆల్పుణ్ణి కాను,
నేను శుద్ధచైతన్యమైన పరమాత్మయొక్క అంశాన్ని"

## 26. ప్రభుప్రేమ

సంసార సౌఖ్యాలు చక్కగా అనుభవించిన తరవాత పర మాత్మనియందు భక్తికలిగి యుండుము.

భగవంతుని తోటి సంపర్కము సంసారబంధాల నుండి విముక్తిని కలిగిస్తుంది. పరమాత్మని బంధించి నీముందుంచుతుంది. గ్రామమున చాలామందికి వ్యాధిసోకవచ్చు. కాని మనము మన బంధుమిత్రులకు సోకి నపుడు మాత్రమే యోగక్షేమాలు వెల్లడము జరుగుతుంది కదా?

ఈరీతిన పరమాత్మనితోటి స్నేహము నీ యోగక్షేమాలు నిర్వ హించుతుంది.

ఎలాగైనాసరే శ్రీమంతునితోడి స్నేహమువాంఛిస్తారు చాలామంది స్వలాభంకొరకు. శ్రీమంతునితోడి స్నేహం ధనాన్ని ఇవ్వగలదు. కాని శాంతిని చేకూర్చగలదా?

శాంతి పరమేశ్వరునితోటి సంపర్కముతోనే లభిస్తుంది.

ప్రభువుతోటి సంబంధముచేత లక్ష్మీపతితోపాటు లక్ష్మీదేవిగూడా మన ఇల్లు వెతుకుతూ పరుగులుతీస్తూ వస్తుంది.

అందువలన చెప్పేదేమంటే అగణితమైన ఈశ్వర రూపాలలో (నామాలలో) ఏదో ఒక రూపాన్ని (నామాన్ని) ఎంచుకొని భక్తికలిగి యుండుము. ఈ సంబంధము ఎల్లప్పుడు ప్రభువుతోటి సంపర్కాన్ని కలిగించి తన్మయత్వాన్ని వృద్ధిచేస్తుంది. ప్రపంచాన్ని మరపిస్తుంది. ధన్యులచేస్తుంది.

"మనస్సు బలపడేదానికి
మంచి ఔషధం— మంత్రజపం"

## 27. ఘనశ్యాముడు

జగత్తు అంతాగూడా సరిక్రొత్త రంగుల్లో మెరిసిపోతూ ఉంటే పరమాత్ముడు మాత్రము ఘనశ్యామ రూపము ధరించేందుకు ఎందుకు ఇష్టపడినట్లు?

మలమలమాడ్చే గ్రీష్మఋతువులో అధికతాపానికి భూమి విలవిలలాడిపోతుంది. భూమిలో చల్లిన ధాన్యపు విత్తనాలు మాడిపోతూ ఉంటాయి.

అన్నపానాలు లేకుంటే మనము ఎట్లా జీవించగలము? ఈలాంటి దారుణావస్థతో బాధపడే ప్రతిప్రాణి ఆకాశమువైపు అర్రులుచాచి ఎదురు చూస్తూ ఉండడము జరుగుతుంది. ఆ సమయములో సప్తవర్ణ ఆభూషణాల చేత అలంకరింపబడిన మేఘానికి కరుణ కలుగుతుంది. విశ్వజన శ్రేయస్సుకొరకు ఏరీతిన పరమశివుడు విషపానము చేయడం జరిగిందో అదేరీతిన మేఘం సముద్రములోని ఉప్పునీటిని పీల్చుకొనడము జరుగుతుంది. అప్పుడు సప్తవర్ణ మేఘము అశుభకరముగా నల్లగా మారినా, దానిలోని ఉత్సాహము మాత్రము తక్కువేమీ కాదు. సముద్రములోని ఉప్పు నీటిని పుక్కిట పట్టుకొని ఉప్పును మాత్రము తనతోనే దాచుకొని నిర్మలమైన జలమును భూమిపై కురిపిస్తుంది.

ఇదిచూచిన ప్రభువు ఇట్లా యోచిస్తాడు— "నేనూ పుడమిపై మంగళ కార్యక్రమాల నిర్వహించ అవతారాన్ని దాల్చవలసియుంది. కనుక అటువంటి ఘనశ్యామ రూపము దాల్చుతాను."— అని అనుకుంటాడు.

"పరమాత్మ పదార్ధముచేత కాదు—
ప్రణామంచేత ప్రసన్నమౌతాడు."

## 28. దుర్లభమైనదీ దేహము

క్షణభంగురమైనది ఈ మానవదేహము.

నీటిపైని బుగ్గవలె అది పుట్టుతూ ఉంటుంది. పగిలిపోతూ ఉంటుంది. "దుర్లభోమానుషేదేహ"— అని శాస్త్రిలు తెలియజేయడమే కాదు, జ్ఞానులు వివరించియున్నారు.

దీనికి కారణము?— ధర్మ, అర్థ, కామ, మోక్షాలు, అను నాలుగు పురుషార్థాలు, మానందేహాన్ని అంటిపెట్టుకొనియున్నాయి. మానవదేహము పరమాత్మ ప్రీతిచేత బంధింపబడియుంది. ఈలాంటి దుర్లభమైన దేహాన్ని మాతా-పితలు మనకు ప్రదానముచేశారు. మరి మనము ఎప్పుడైనా కృతజ్ఞతలు తెలిపినామా? ఎప్పుడైనా వారికి మనము ప్రాతఃకాలమున నమస్కరించామా? వృద్ధాప్యములో వారికి మనము ఏ చిన్న పనినైనాచేసి సహకరించామా? సేవ చేశామా?

మాతాపితలే సాక్షాత్తు దైవస్వరూపులు వారిని కష్టపెట్టిన పరమాత్మ మనపై కరుణ చూపడు. కరుణతో కూడిన వారి చూపులు ఆశీర్వాదాలు అనే అమృతపు జల్లులతో మనయొక్క జీవనవల్లరి (జీవిత మనే మొక్క) పుష్పిస్తుంది. ఫలిస్తుంది!

పితృభక్తి ప్రభావముచేత పుండరీకుడు, విఠలనాదుని ఇటుకపై నిలబెట్టగలిగాడు. శ్రవణ కుమారుని మాతా-పితల సేవను చూచికదా. పరందాముడు భూమిపై ఆవిర్భవించడము! కనుక దుర్లభదేహమని చులకనగా చూడకు, దీన్ని ప్రాప్తింపచేసినట్టి మాతా-పితలను మరువద్దు.

"వదనములో హృదయములోని భావాలు
సంగమింపచేసినపుడే సార్థకం."

## 29. నీవు సేవకుడవుకాదు - యజమానివి

జ్ఞానస్వరూపుడగు కపిల భగవానుడు "కర్థముడు"- దేవహూతు లకు పుత్రుడుగా అవతరిస్తాడు. కర్థముడనగా, ఇంద్రియాలనణచువాడు, జితేంద్రియుడని అర్థం.

ఆత్మ ఇంద్రియాలకు సేవకుడు కాదు. యజమానియొక్క కర్త వ్యము ఏమిటి ? సేవకుని గుప్పిటిపట్టి పని చేయించడము.

కనుక కర్థమునివి కావాలంటే ఇంద్రియాలద్వారా జరిగే ప్రవృత్తు లను, మోహాన్ని విసర్జించాలి.

ఇంద్రియాలు ఏమికోరుతాయో వాటినన్నింటిని నిషేధించాలి.

నిగ్రహాన్ని పాటిస్తే జీవితములో జ్ఞానమువచ్చి చేరుతుంది. లేకుంటే నయనాలు, నాలుక మనలను భ్రష్టత్వములోనికి ఈడ్చుక పోతాయి.

ఒకవేళ ఇంద్రియాలు నిన్ను యాచిస్తే వాటికి గట్టిగా చెప్పు— "నేను నీ సేవకుడను కాను. యజమానిని. సర్వేశ్వరునకు మాత్రమే సేవకుడను."— అని చెప్పు.

జ్ఞానస్వరూపుడైన కపిలుని నీ హృదయాంగనములోనికి పిలువాల నుకుంటే- "కర్థమునివి"— కావాలి. ఒక్కొక్క ఇంద్రియాన్నే వశపర చుకో ? నిగ్రహముద్వారా నేత్రాలు మనస్సులయొక్క శక్తిని పెంపొం దించు తరువాత మంచి మనస్సుతో సత్కర్మలాచరించు."

"పరమాత్ముని సర్వదా వెంటనుంచుకో"

అప్పుడే

జీవితము సఫలమౌతుంది."

## 30. సంపద కలిగెనా... జాగ్రత్త

"గోకులమునందు నగ్నముగా సంచరించే శ్రీకృష్ణుడు "కంస" వధానంతరము మధురాధిపతిజీతాడు.

ఆయన కాళ్ళముందు అపారమైన ఐశ్వర్యమువచ్చి చేరుతుంది. అయినను ఆయన తన సుఖ-దుఃఖాలలో పాలుపంచుకునే స్నేహితుల, గోప-గోపికలను మరువలేదు.

ఆపద కలిగినపుడు భయ-భితులు కావడము అవసరము. ఎందుకంటారా— వివేకము మనలో మేల్కొనడము జరుగుతుంది.

కాని సంపదకలిగితే మనము చాలా జాగ్రత్తపడడము అవసరమౌతుంది. ఎందుకనగా సంపద కలిగితేఅహంకారమనే జ్వరం పుట్టుకరావడముతో ఈశ్వరుడు మదిలో మెదలడు. వివేకము నశించి జీవితమనే 'రసం' ఎండిపోతుంది.

అందుకని జ్ఞానులు— "సంపదవచ్చి చేరగానే జాగ్రత్తవహించు. వివేకమును, విశ్వనాధుని విస్మరించకు ?- సంపదలు, ఆపదలు, మార్పు చెందుతూ ఉంటాయి. ఏదీ స్థిరముగాదు- అనేది తెలుసుకోమంటారు.

"కథాశ్రవణము జరిగాక - జీవితమున మార్పు జరగాలి."

## 31. అందరిలో హరిని దర్శించు

ప్రతిజీవికి శ్రీహరిని దర్శించాలనే కోరిక ఉంది.

ఆ కోరిక తీర్చుకునేందుకు ఈభూమిపైకి రావడము జరిగింది.

ఈ తపన తీర్చుకునేదానికే మందిరమువెళ్ళి దేవతా విగ్రహాన్ని దర్శిస్తాము.

విగ్రహ దర్శనం సామాన్యమైన దర్శనం మాత్రమే, అక్కడ పరమాత్మని తేజోమయరూపం అగుపించదు.

ప్రతిచోట, ప్రతివారిలో పరమాత్మని దివ్యమంగళ రూపము దర్శించడము— అసాధారణ దర్శనం. ఎందుకంటారా, వారు ప్రభువు యొక్క చైతన్యవంతమైన ప్రతిరూపాలు.

అందరిలోను భగవంతుడిని దర్శించడముతో జీవితము ధన్యమౌతుంది. 'స్త్రీ' యని, పురుషుడని తేడాచూపక అందరూ దైవస్వరూపులని తిలకించు ?

"ఈ శరీరమే నాదికానపుడు
మరి ఈ ధనం నాదెట్లా ఔతుంది!"

## 32. జ్ఞానము - భక్తి

నేడు చాలామంది మహాత్ములు జ్ఞాన, వైరాగ్యాలగూర్చి చాలా గొప్పగా మాట్లాడుతూ ఉంటారు. కాని ఏ కొంచెము నష్టము సంభవించినా కోపతాపాలతో మండిపోతారు.

శాంతిని పాటించి సర్వులకు విపరించవలసిన జ్ఞానులే కోపతాపాలకు ఆశ్రయము కలిగిస్తే మరి వారిని జ్ఞానులని ఎట్లా అనుకోవాలి ?

జ్ఞానాన్ని పొందడము— ప్రభుప్రేమను పొందడము, చాలా కష్టము. ఐననూ ఈ రెండూగూడా శ్రేష్ఠమైనవి. దేనికి ఏదీ తక్కువ కాదు.

భక్తికి జ్ఞానము అవసరము. జ్ఞానానికి భక్తి ఎంతో అవసరము. భక్తియే లేకుండే జ్ఞానం కుంటిదైపోతుంది. జ్ఞానం లేకుంటే భక్తి గుడ్డిదైపోతుంది.

ఎక్కడెక్కడ దృష్టి పడుతుందో, అక్కడక్కడ పరమాత్మను దర్శించాననే ధృడ సంకల్పము కలుగుతుందో, అదే జ్ఞానం.

జీవితము సార్థకమయ్యేందుకు అలాంటి జ్ఞానం, అటువంటి భక్తి ఎంతో అవసరం.

"దేశమంతా దుఃఖములో మునిగియుంది.
ఎందుకలా ?
జతిబు జగన్నాదుని మరిచారు.
ఆయన చేసిన ఉపకారాన్ని మరిచారు."

## 33 భాగము

మృత్యువనగా అర్థమేమి ? భగవంతునకు చెల్లించవలసిన ఆదాయపు పన్ను కట్టవలసిన గడువు.

మృత్యువనగా—పరమాత్మునికెంత జీవితములో భాగాన్ని పంచవలసిన సుదినము.

భగవంతునకు చెల్లించవలసిన భాగములో తూకము (వాటా) సరిగా ఉన్నపుడు భయముదేనికి ?

ఆదాయపుపన్ను చెల్లించునపుడు మానవుడు ఏమిచేస్తాడు ? దేవాలయమెళ్ళి, పరమాత్మని చరణాలకు ప్రణమిల్లి, కానుకలర్పించి "దైవమా అధికారి (ఆఫీసర్) గారి కన్నుల్లో దుమ్ముచల్లి నా వ్యాపారము సాగేటట్లుచూచి నన్ను రక్షించు"— అని అంటాడు.

మనముచేసే పాపకార్యాలు పరమాత్మునికి అంటకట్టడము చేస్తాం.

మనిషి, మనిషిని మోసము చెయ్యవచ్చు. కాని సర్వేశ్వరుని మోసగించలేడు. పరమాత్మ సర్వాంతర్యామికనుక అంతా తెలుసుకుంటాడు.

జీవితమనే చదరంగమున గలాటా (గలబ) లేకుండా ప్రభు సన్నిధిని చేరేముందు, భయంలేకుండా సంసిద్ధముగా ఉండాలి.

"భగవానుని సేవకుడు ఎప్పుడూ

నిర్భాగ్యుడు కాడు."

## 34. భక్తితో కూడిన జ్ఞానము

శ్రీకృష్ణుని విరహతాపముతో రేగిపోయిన గోపికలకు ఊరట కలిగించేటందులకు ఉద్ధవుడు ఏమేమో చెప్పుతాడు. సతతము శ్రీకృష్ణ సాన్నిధ్యములో మునిగితేలే గోపికలకు ఉద్ధవుడు శుష్క వేదాంతము తలకెక్క లేదు.

కారణమేమనగా దంబముతోకూడిన ఉద్ధవుని జ్ఞానబోధ వారికి నిస్సారమనిపించింది.

"జ్ఞానము" మంచిదే— అభిమానముతోకూడిన జ్ఞానము మంచిది కాదు

అభిమానము తోటి జ్ఞానం చాలా పాపాలు చేస్తుంది. ముంకిపైన వాలిన ఈగలాగా, అభిమానము ఇతరుల గుణదోషాల నెంచడము అలవాటు చేసుకుంటుంది. అలాంటి నిస్సారమైన జ్ఞానము మనకెందుకు!

భక్తితోకూడిన జ్ఞానముద్వారా పరమాత్మని తెలుసుకోవాలి.
"సత్పురుషునికి కాలము చాలా విలువైనది"

## 35 భక్తిమయ వ్యవహారము

భక్తి ఎల్లప్పుడు కలిగియుండాలి. దారిలో నడిచేటపుడు, అంగడిలో కూర్చొని వ్యాపారము చేసేటపుడు, బండిలో ప్రయాణము చేసేటపుడు, ఒకటేమిటి— సర్వకాల సర్వావస్థలయందు, సర్వము వ్యాపించియున్న పరమాత్మనియందు భక్తికలిగి యుండాలి.

వ్యాపారి వ్యాపారము చేస్తాడు. అందులో ఏదోషము లేదు. న్యాయమైన లాభము పొందడము పాపముకాదు, కాని బేరగాని అజ్ఞానమును, మూర్ఖత్వాన్ని ఆసరాతీసుకొని వాడిని దోచుకోవడము మహాపాపము.

ప్రతి కార్యక్రమములోను పరమాత్మని తలచుకొని కార్యాన్ని ఉపక్రమించు- నీ వ్యాపారమంతా భక్తిమయమౌతుంది.

పరమాత్మార్పితమైన కార్యముచేస్తూ ఉంటే నీవాక్కు సత్యవాక్కు అవుతుంది.

భక్తి ఏ రెండు మూడు గంటలోచేసేది కాదు. ఇరవైనాలుగు గంటలూ ఆచరించాలి.

నీవృత్తిని భక్తిమయము చెయ్యాలి.

"ప్రభుభక్తుడు

సుఖములో పొంగేవాడు కాదు.

దుఃఖములో కుంగేవాడు కాదు."

## 36. ఎక్కడ భేదము ఉందో - అక్కడే భయం

ప్రతిప్రాణినీ ఎప్పుడైతే భగవద్భావముతో చూడడము అలవాటు, చేసుకుంటాడో; అట్టివాని మనస్సు ఎప్పుడూ చెడిపోదు.

అట్టి సత్పురుషులకు ఎవ్వరూ విరోధులూ ఉండరు.

జ్ఞాని చైతన్యరహితములోనూ పరమాత్ముని దర్శిస్తాడు. ఎందుకనగా జ్ఞానులు పరబ్రహ్మతత్వాన్ని పరబ్రహ్మ దృష్టిని కలిగినవారు కనుక.

ప్రకృతిలో జడాజడ పదార్థాలయందు, సర్వదా ఎవరైతే 'హరి' ని దర్శిస్తారో వారు ఎప్పుడూ ప్రభు వినియోగాన్ని అనుభవించరు.

అన్నింటా హరిని దర్శించేవారి జీవితము పరమాత్మలో లీనమౌతుంది హరినొక్కడినే దర్శించడముచేత భేదభావాలు తొలగిపోతాయి.

ఎక్కడ భేదభావముందో అక్కడ భయం ఉంటుంది.

కాటువేసేందుకువచ్చే తక్షకునిలోగూడా పరమాత్ముని చూడడముతో పరీక్షిత్తునకు మృత్యువన్ననూ భయములేదు.

"ఎవ్వరి మనస్సు బంగారుపై వుంటుందో—
వాడు
రావణుడు."

## 37. ప్రతివారిలోను పరమాత్మ దర్శనము

ప్రకృతిలోని జడ పదార్థాలలోను చైతన్యముగల స్త్రీ-పురుష లలోనూ భగవత్ దర్శనాన్ని పొందేదానికి అలవాటు చేసుకో?

ఈ అలవాటు కలిగియుంటే నీకు ఈ జగత్తునందు ఎవ్వరూ శత్రువులుండరు. ప్రపంచములోని మరి ఏ వస్తువుపైగూడా నీ మనస్సు చెడిపోదు.

గోస్వామీ తులసీదాసు తానువ్రాసిన శ్రీరామచరిత మానసీనందు ఈ విషయాన్నే వ్యక్తంచేశారు.

"సియారాంమయసబ్ జగ్ జానీ।
.కరహుం ప్రణామ్ జోరి జగు పానీ॥

ప్రతివారిలోను పరమాత్మ నివాసముంటే వైరం ఇంకెవ్వరితో ఉంటుంది? ఎందుకుంటుంది?

ప్రతిప్రాణిలోను జగదీశ్వరుని దర్శించుటచేత శాంతి లభిస్తుంది

"ఎవనికైతే పాపభీతి కలుగదో—
వానిమదిలో శాంతియుండదు."

## 38. గృహస్థాశ్రమము ద్వారానే పరమాత్మని పొందు

సంసారమును వదలిపెడితేగాని భగవత్ప్రాప్తి లభించదని మనకు భాగవతము చెప్పడము లేదు.

సంసారమును వదలవద్దు. ఐతే సంసారముపై మమకారమును విసర్జించమని భాగవతము మనకు తెలియచేస్తుంది.

ఇల్లుగూడా భగవంతుని మందిరముగా భావించి వివేకముతో గడపమంటుంది— "భాగవతము" కావున సంసారాన్ని విడిచివెళ్ళవలసిన అవసరమేలేదు.

నీ ఇంటికి యజమాని భగవానుడేనని, ఆయనకు నీవు అతి సామాన్యమైన సేవకుడనని భావించాలి.

నేనే గొప్ప అనే భావనలో దుఃఖము కలుగుతుంది. ఆ భావనను వదులుకుంటే దుఃఖము తొలగిపోతుంది.

ధనమును (లక్ష్మిని) చులకనగా చూడమనికాదు. తన స్వార్థానికే ధనాన్ని వినియోగించక సత్కార్యార్థం, సదుపయోగం చెయ్యాలి. అప్పుడే పరమాత్మ ప్రసన్నమౌతాడు.

"సత్యాన్ని ఋుజువు చేసేవారికి
శాంతి ఎక్కడినుండి లభిస్తుంది."

## 39. వ్యవహారము

చాలామంది వైష్ణవులు వారి వ్యాపార కేంద్రాలలో ద్వారకానాథుని (శ్రీకృష్ణుని) చిత్రపటాన్ని తగిలించియుంటారు.

వ్యాపారము చేసేటపుడు బేరగాళ్ళను దోచుకునేటపుడు, భగవాన్ చవిచివాడని భావించి పనులు చేస్తూనే ఉంటారు.

కాని ఇదంతా మిథ్యయని ఎరుగరు.

పరమాత్ముని కన్నుల ఎదుటనే పరమాత్ముని తనయులు నిలువునా దోపిడీ చేయడము మంచిదా ?

వ్యాపారము చేసేటపుడుగూడా నీ బేరగాళ్ళయందు పరమాత్ముని దర్శిస్తే నీ వృత్తి కూడా పరమాత్మార్పితమౌతుంది. భగవంతుని పొందే సాధన మౌతుంది.

మన వ్యవహారము మంచిదైనపుడు భక్తి కుదురుతుంది. ఎవని వ్యవహారమైతే కుమార్గమున పయనిస్తుందో వానికి భక్తి ఎట్లా కుదురుతుంది

త్రాసును చేతపట్టిన వైశ్యులు తమ వృత్తిని గురువుగా భావించి వ్యాపార విషయాల్లో నమ్మకముగా వ్యవహరించడము వలన, భగవంతుడు అట్టివారిని భక్తులుగా స్వీకరించడము జరుగుతుంది.

"స్త్రీలు పాత్రలు ఎంతో శుద్ధముగా ఉంటాయి.

అపవిత్రమైనవి కావు - ఆరోగ్య ప్రదము కావు"

## 40. అత్తరులాంటి భక్తి

భక్తి ప్రదర్శించే వస్తువుకాదు. అది పరమాత్మని మన హృదయాలలో బంధించే సాధనం.

భక్తిని ప్రకటించవద్దు. దానిని గుప్తముగా ఉంచుకో? లేకుంటే అది అత్తరుమాదిరి ఆవిరైపోతుంది.

భజనచేస్తూ, కీర్తన పాడేటపుడుగని, ఇంట్లో దేవునిఎదుట దీపారాధనచేసి, ఏకాంతముగా కూర్చుని, పరమాత్మను ప్రసన్నంగావించేటపుడుగాని, వెలుపల ఎదురముగా పాటపాడుతూ నర్తించేటపుడుగాని నీలోని భావాలు, భగవంతుని జాగృత పరచలేకుంటే అది భక్తిగాదు. పూజగూడాగాదు. అని అందరికి తెలియజేసే "అలంకారపూజ"— అని అనవలసివస్తుంది.

భక్తి సమాజానికి తెలియచేసేదానికి కాదు. ప్రభువును ప్రసన్నముగావించుకునేందుకేనని జ్ఞప్తియందుంచుకో?

"క్షణం క్షణం ఒక కణమును
ప్రోగుచేసేవాడు మహాత్ముడనిపించుకుంటాడు."

## 41 సంపద - ఆపద

మనకు భగవంతుడు అపారమైన సంపద ప్రదానము చేసినా, ఆ సుఖజీవితమున మనము భగవంతుడిని విస్మరించవద్దు.

ఒకవేళ మనకు పరమాత్మ ఆపదలు కలిగించినా ధైర్యాన్ని కోల్పోక సాధనను మాత్రము వదలవద్దు.

సామాన్య మానవుడు అధిక సుఖప్రాప్తి కలుగగనే పూర్వస్థితిని మరచిపోతాడు. అందుచేత వారు అత్యంత దుఃఖాన్ని పొందుతారు.

సుఖముగూడా పరమాత్ముడు చేసిన ఉపకారమును స్మరించుకో ? దుఃఖము ఎప్పుడూ నీదరికిరాదు.

దుఃఖములో ప్రభుసాన్నిధ్యాన్ని మననము చేసుకొని ధైర్యముగా ఉంటే దుఃఖాన్నిగూడా తెలుసుకుంటావు.

అభిమానాన్ని చంపుకొని హృదయాన్ని కోమలముగా మలచుకుని పరమాత్మని స్మరించుతూ, దైవ సాన్నిధ్యానికిచేర్చే ఆపదలే నిజమైన సంపదలు.

భగవంతుని దూరముగాచేసే సంపద, సంపద కానేరదు. అది 'ఆపద'

"కొందరు అధికముగా భోంచేయడముచేత బాధపడతారు
మరికొందరు
భోజనం లభ్యంకాక బాధపడుతారు."

## 42. మంత్రము - విగ్రహము - మాల

ఏదైనా మహామంత్రాన్ని జపించే సమయములో ఇంట్లో ఎవరైనా మృతులైతే, లేక ఏదైనా పెద్ద నష్టము జరిగితే అది మహామంత్ర ప్రభావమని భావించవద్దు. ఆ మంత్రాన్ని వదలి మరో మంత్రాన్ని జపించేదానికి ఆలోచన చెయ్యవద్దు.

మంత్రాన్ని, రూపాన్ని, (విగ్రహం) మాల, ఈమూడు ఎప్పుడూ మార్చగూడదు.

ఎందుకంటారా, ఒక లక్షసార్లు మంత్రజపం జరిగిన తరువాత మాలలో దివ్యశక్తి వెలువడుతుంది. అటువంటి మాలను ఎట్లా త్యజించాలి ?

వ్యవహారిక కార్యక్రమాలు నిర్వహిస్తూగూడా మంత్రాన్ని జపిస్తూ ఉంటే మంత్రము సిద్ధిస్తుంది.

ప్రతిక్షణం, ప్రతి ఘడియా పరమాత్మ స్వరూపం జ్ఞాననేత్రము ముందు సాక్షాత్కరిస్తే నీలో ప్రభు స్వరూపము సిద్ధించినట్లు!!

"కొందరికి అజ్ఞానముతో దుఃఖము వస్తుంది.

మరికొందరికి

జ్ఞానము కలదనే అభిమానముచేత దుఃఖం ప్రాప్తిస్తుంది.

## 43. మనస్సు చెడిపోయి ఉంది

ప్రపంచముగాదు. చెడిపోయింది నీ మనస్సు.

పాపం పెరిగింది ప్రపంచములో కాదు. మన మనస్సుల్లో

లోకాన్ని ఉద్ధరించాలనుకునే బదులు నీ మనస్సును ఉద్ధరించుకునే దానికి ప్రయత్నించు.

ఈ విషయం నీ మదికి స్నేహపూర్వకముగా తెలియపరచు.

మనస్సు లౌకిక వాసనలకు అలవడితే చెడుతుంది. కాని అది దైవభక్తిచే అలౌకిక వాసనలలో మునుగుతే బాగుపడుతుంది.

మనస్సే మానవుని శత్రువు-మిత్రుడు. మనము మనస్సుకు దాసుల మౌతామా, జారిపోతాము. (చెడిపోతాము) మనస్సును గుప్పిటియందుంచు కుంటామా, ముందుకుపోతాము.

o .

"ఒకే ఒక క్షణం (అరువు) తో చీమ కడుపునింపుకుంటుంది
ఒకే ఒక క్షణంలో పాపులు ఉద్ధరింపబడుతారు.

## 44. సత్కార్య సమాప్తి

సాధన, సత్కర్మ. ఈ రెండింటిని ఎప్పుడూ అంతం చెయ్య కూడదు.

జీవితపు చివరి క్షణంవరకు సాధన, సత్కర్మ జరుపుతూ ఉండవలసిందే. సంధ్య చీకటులు వ్యాపించిననూ సాధన సాగుతూ ఉండవలసిందే !

అందుకనే వైష్ణవులు పరమాత్మను పొందిన తరువా తకూ సాధన సాగిస్తూనే ఉంటారు.

జపమునకు ఎప్పుడూ పూర్ణాహుతి (సమాప్తం) అనేది ఉందా? ఉండబోతుందా ? చెప్పండి !

"ఎక్కడ ఆచార్య వ్యవహారాలు ఉంటాయో
అక్కడ భక్తి నిండియుంటుంది."

## 45 తల్లి - తండ్రి

ఎవరికైతే తల్లిదండ్రులు జీవించియున్నారో అట్టివారు ప్రాతః కాలముననే ప్రప్రథమమే తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించాలి.

ఎవరి తల్లిదండ్రులైతే స్వర్గప్రాప్తి పొందియుంటారో అట్టివారు గూడా, స్వర్గస్తులైన తల్లిదండ్రులకు మనస్సులో వందనమాచరించి, ఆ తరువాత వారి వారి పనులకుపక్రమించాలి.

తల్లిదండ్రులే మనకు ప్రత్యక్ష దైవస్వరూపాలు.

అట్టి ప్రత్యక్ష దైవముల ఉపేక్షించేవారి పూజలు పరమాత్ముడు స్వీకరింపడు.

నేడు చాలామంది విద్యాధికులు తల్లి-దండ్రుల చరణాల స్పర్శించే దానికి సిగ్గుపడతారు.

వారే లేకుంటే మనమెక్కడివారం ?

"మంచి ఆలోచన పునాది వంటిది.

సదాచారమే భవనము

పునాది బలముగా ఉంటే భవనము చక్కగా ఉంటుంది."

## 46. మనం మరణించేవారం కాదని తెలుసుకో ?

మన గృహావరణమందు జరిగే వివాహానికి కావలసిన ఏర్పాట్లన్నింటిని ఒకరినాల ముందునుండి చేస్తాం.

ఏదైనా ప్రక్క పట్టణానికి వెళ వలసివస్తే రెండు మూడు దినాల ముందే ఏర్పాట్లన్నీ చూసుకుంటాము.

అనివార్యమైన మృత్యువునకు మనం అన్ని ఏర్పాట్లు ముందుగానే చేస్తున్నామా ?

బహుశా మనం లగ్నం మరువవచ్చు.

ప్రక్కగ్రామం వెళ్ళవలసివస్తే మానుకోవచ్చు.

కాని మృత్యువు అనివార్యమే !

ఇది తెలిసిగూడా మానవుడు మరణించేముందు మరి ఏ ఏర్పాట్లు చేసుకోడు.

మనిషి ఎప్పుడూ చనిపోయేవాడుకాదని తెలుసుకో !

"నీ ఇష్టానుసారము కాక
జ్ఞానుల నిర్ణయానుసారము సత్కర్మ చెయ్యి."

## 47. త్యాగ సమర్పణ

పరమశివుడు త్యాగానికి ప్రతీక. శ్రీకృష్ణుడు ప్రేమకు ప్రతీక.

శంకరుడు ప్రపంచముకొరకు సర్వస్వాన్ని త్యాగముచేసి జగత్తు నందు దేనిని యాచించక కాలకూట విషాన్ని పానంచేస్తాడు.

శ్రీకృష్ణుడు సర్వజనాన్ని ప్రేమాభిమానాలతో చూశాడు. తనను దూషించినవారిని, విషం త్రాగించినవారిని తన్నినవారినిగూడా తనవారిగా గౌరవించాడు, అందుకే ఆయన సర్వులకు ప్రియుడు.

పరమేశ్వరుడు జ్ఞానమార్గాన్ని తెలియచేస్తే శ్రీకృష్ణుడు ప్రేమ మార్గాన్ని తెలుపుతాడు.

జ్ఞానమార్గం త్యాగాన్ని సూచిస్తుంది.

భక్తి మార్గమందునూ త్యాగం ఉంది. కాని దానిలో స్నేహం కలిసియుంటుంది.

"సృష్టికర్త చేసిన ఉపకారాలను ఎవరు మరచిపోతారో—
వారెన్నటికి సుఖపడలేరు ?"

## 48. ఆనందము - నీలోనే ఉంది

ఆనందమనేది ఎక్కడో బయట దొరకదు. అది నీలోనే ఉంది.

వెలుపలి పదార్థాలలో ఆనందముందని వెదికితే 'వేదన' అనెడి కుంపటిలో పడిపోవడము జరుగుతుంది. ఏ వస్తువులో ఆనందము నీవు చూడగలవో అది ఒకానొక దినము నశిస్తుంది. ఆ దినము శోకానికి హద్దులుండవు.

కస్తూరిమృగం ఎక్కడో సువాసన వస్తూ ఉందని వనమంతా గాలిస్తుంది. కస్తూరి తన నాభిలో ఉందని అది తెలుసుకోలేదు.

ఆదేరీతిన ఆనందముగూడా నీలో వెలుగుతూ ఉంది. కానీ జీవుడు ఆదెక్కడో ఉందని వెదుకుతూ ఉంటాడు.

నేడు సుఖాన్ని కలిగించే పదార్థాలు రేపటికి దుఃఖాన్ని కలిగిస్తాయి.

కడుపుతోగల బాధను భరించి రాజమహల్లోని ఆనందాన్ని అనుభవించగలమా ? తీరనివేదన కడుపులో ఉంటే ఆనందము కలుగుతుందా ?

పంచభక్ష్య పరమాన్నాలు ఆరగించినా, ఆనందము కలుగదు. అజీర్ణరోగము కలిగించి దుఃఖాన్ని ప్రాప్తింపచేస్తుంది.

అందుకే చెప్పకొచ్చేదేమంటే— ఆనందము వెలుపలలేదు, అది నీలోనే ఉంది. అక్కడే వెదుకు.

"ఎవని మనస్సు సత్కర్మలో లీనమై ఉంటుందో
వాడే రాముడు."

## 49. నిదురించినా, మేల్కొనినా హరినామస్మరణ

రాత్రిపూట పక్కపరచి నిద్రించేదానికి ఉపక్రమించేముందు దేనిలో నీవు లీనమైతావు ?

కొందరు నిద్రిస్తూ నిద్రిస్తూ వ్యాపార విషయాలు మనన చేసు కుంటారు

కొందరు పక్కపై పరుండగానే కామాంధులౌతారు.

మరికొందరు సౌభాగ్యవంతులు శయనించేముందు భగవన్నామ స్మరణ చేస్తారు.

ఎంతవరకు శరీరము అలసిపోతుందో అంతవరకు ప్రక్కపై పరుండవద్దు.

పరోపకారార్థమై శరీరాన్ని ఉపయోగించు. నిద్ర వచ్చినంతవరకు జపించుతూ ఉండు. రెండుమూడు నిమిషాల్లో నిద్రవస్తుందనగా పడకపై పడుకో,

జపంచేస్తూ చేస్తూ నిద్రించు. జపము చేస్తూ చేస్తూ బ్రంహ్మ ముహూ ర్తంలోనే మేలుకో ?

నిద్రించేముందు జపంచేస్తూ మేల్కొనే సమయానగూడా జపిస్తూ నిద్రలేస్తే అట్టివాని నిద్రాసమయమంతాగూడా నామస్మరణమౌతుంది. భగవంతుని ఖాతాలో మన నిద్రకాలము నామస్మరణ సమయముగా లిఖించబడుతుంది.

"ఎవ్వని మదిలో పుత్రుడు కలిగినా ఆనందము
లేక పుత్రుడు మరణించినా ఆనందము ఉంటుందో—
వాడే భక్తుడు."

## 50. మహాత్ముని వి కావాలి

ప్రతి గ్రామమందును ఒక మహాత్ముడు ఒక పవిత్రురాలు (పతివ్రత) ఉండి తీరాలి. వారు లేనట్లయితే ఆ గ్రామము నాశన మౌతుంది

ఐతే మహాత్ముడు దొరకడం చాలా దుర్లభం. ఎందుకంటారా, మహాపురుషుల కనుగొనడము చాలాకష్టము.

అందుకని నేను చెప్పకొచ్చేదేమంటే— మహాత్ముల వెదికే దాని కంటే నీవే స్వయముగా మహాత్ముని వి ఎందుకు కాకూడదు ?

మహాపురుషుల యొక్క మనస్సు, ఇంద్రియాలు, ఒకటేమిటి సర్వము భక్తితో నిండిఉంటాయి. ఒక్కక్షణంగూడా వారు హరినామ స్మరణ చెయ్యలేకుండా ఉండలేరు.

నేటినుండి నీవు, నీ నయనాలు ఇంద్రియాలు, నీ కార్యకలాపాలు సర్వము భక్తితో నింపు. సర్వవేళ సర్వావస్థలయందు ప్రభుస్మరణతో లీనమైపో. నీలో నీవు మహాత్ముని దర్శించు

"పుత్రుడు లేకున్నా పుత్రుడు కలిగినా లేక
పుత్రుడు మరణించినా ఆనందము ఎవని
మదిలో ఉంటులదో, వాడు భక్తుడు."




## 51. మృత్యు మహోత్సవము

మహాత్ముల 'మరణం'— మంగళప్రదం. వారి వర్ధంతిని పుణ్య తిధిగా భావించి ఉత్సవం జరుపుతారు జన్మతిధిని కాదు.

శ్రీరాముని, శ్రీకృష్ణుని జన్మ జయంతిని జరుపుతారు.

మహాత్ములు స్వర్గధామమును ఎట్లా చేరుకున్నారు. ఇదిచూచే దానికి స్వర్గంనుండి దేవతలు భువికిదిగి వస్తారు.

అంపశయ్యపై భీష్ముడు పరుండగా ఆలోచిస్తూ ఉంటాడు. "నేను కాలుది వశంలోలేను నేను ప్రభు సేవకుడను. మరి పరమాత్ముడు ఎప్పుడు నన్ను తీసుకెళ్ళుతాడో అప్పుడే ప్రయాణమౌతాను."— అని అనుకుంటాడు.

భీష్మ పితామహుడు కామాన్ని జయించినవాడు. అందువలన ఆయన కాలపాశబద్ధుడు కాదు. ఎవ్వరైతే కామానికి వశమౌతారో వారు కాలుని వలలో చిక్కుకుంటారు.

"పుత్రులు - పుత్రికలనే మోహం పనికిరాదు.
వివేకమనే సంతానం సద్గతిని కలిగిస్తుంది."

## 52. స్మరణ - సత్కర్మ

దానము, యజ్ఞము,— ఏ సత్కర్మనైనా ఆచరించు— ఐతే ఆచరించేటప్పుడు హరినామ స్మరణగూడా ఆలపించు.

నామస్మరణలేని ఏ సత్కర్మయైనా అభిమానం పుట్టుకొస్తుంది. చేసిన శ్రమ వ్యర్థమౌతుంది.

దానము. యజ్ఞముచేస్తే పుణ్యము వస్తుంది. అందులో సందేహమేమీలేదు. కాని పరమాత్ముడు లభించడు. కరుణాపూర్ణ హృదయముతో చేసిన నామస్మరణచేత భగవత్ ప్రాప్తి కలుగుతుంది

నామస్మరణ లేకుంటే హృదయము శుద్ధికాదు. పాపాలనుండి విముక్తి కలుగదు. జీవితానికి శాంతి లభించదు.

కనుక ఏ సత్కార్యము చేసినా హరినామస్మరణ చేస్తూ వినయవిధేయతలతో నిష్కామభావముతో చెయ్యి.

సత్కర్మతో పుణ్యము దొరకవచ్చు. స్వర్గప్రాప్తి కలుగవచ్చు. కాని భగవత్ప్రాప్తి కలుగదు.

పుణ్యం నశించే పదార్థం. అదెప్పుడు నశిస్తుందో— అప్పుడు స్వర్గంనుండి బలవంతంగా మెడపట్టి క్రిందికి త్రోస్తారు.

కాని నామస్మరణతోచేసే సత్కర్మ. పరమాత్మ సన్నిధికి చేర్పుతుంది, అక్కడనుండి మరెవ్వరూ బయటికి పంపించలేరు

"నీ పిండప్రదానము. శ్రాద్ధకర్మలను స్వయముగా నీవే నిర్వహించు లేకుంటె సద్గతి లభించదు !!"

## 53. పరమేశ్వరోపకారము

"శ్రీమద్ భాగవతమునందు పురంజనునికి కథ వస్తుంది.

ఆ పురంజనునికి అవిజ్ఞాతుడనే మిత్రుడన్నాడు. ఆ అవిజ్ఞాతుడు సర్వదా పురంజనునికి సహాయముచేస్తూ ఉంటాడు.

ఈ పురంజనుడు ఎవ్వరోకాదు— "జీవాత్మ" మరి అవిజ్ఞాతుడనగా "పరమాత్మ".

జీవుడు ఈశ్వరునికి దూరముగానుండే ఈశ్వరాంశ ! ఈ జీవుడు తనను తాను తెలుసుకున్నందున, ఈశ్వరునకు జీవునిపైన అపారమైన ప్రేమ. ఈ జీవాత్మ, ప్రతిక్షణం గుప్తముగా ఉండి సహాయముచేస్తూ ఉంటుంది.

పరమాత్మ జీవునితో ఇట్లా అంటాడు— ॥భూమిపై వ్యవసాయం చేయడము నీవంతు అందుకు వర్షాన్ని కురిపించేకార్యము నాది. విత్తనము నాటడము నీవని. దానిని అంకురింప చెయ్యడము నావని. నీవు పొలాన్ని కాపలాకాస్తే, నేను పంటను పక్వానికి తెస్తాను. నీవు భోంచేస్తే నేను జీర్ణం చేస్తా !"

భోజనంచేసిన తర్వాత నిద్రించేపని నీది. ఆ అపస్మారదశలో నిన్ను రక్షించే భారంనాది !

ఈ జీవునిపైన పరమాత్మునకు ఎంత అపారమైన ప్రేమ ! అనా ఈ జీవుడు ఎంతటి కృతఘ్నుడు !

దీనివలన మనకు వ్యక్తమయ్యేది ఏమనగా, "జీవితముతో ఎన్నో విజయాలను సాధించికూడా ఈశ్వరుని విస్మరిస్తామే !- ఇదేమి న్యాయం?

"నీ ఉన్నతి
నీ చేతియందే ఉంది."

## 54. జీవన శకటానికి సారథి

రాత్రివేళ ప్రయనించే రైలుబండిలో అందరూ నిద్రిస్తారు. కాని రైలునడిపే డ్రైవర్ నిద్రించగలడా ?

అర్ధరాత్రి వేగంగా పరుగులుతీసే మోటారుబండిలో అందరూ నిద్రించవచ్చు. కాని మోటారుబండిని నడిపేవాడు నిద్రిస్తాడా ?

సారథి (డ్రైవర్) నిద్రిస్తే బండి ఏమైపోతుంది !

ఘోరమైన ప్రమాదముజరిగి అనేకమంది యాత్రికులు జీవితం పోగొట్టుకుంటారు.

"ఈ విషయం జీవన శకటాన్నిగూర్చి !"

'జీవుడు' యాత్రికుడు. ఈశ్వరుడు డ్రైవర్ (సారథి) జీవుడు నిద్రిస్తాడు. పరమాత్ముడు రక్షిస్తాడు. జీవుడు భోంచేస్తాడు. భగవంతుడు జీర్ణంచేస్తాడు.

ఈ రీతిన జీవన శకటాన్ని డ్రైవర్ చేతిలోనుంచి ప్రపంచాన్ని చుట్టివచ్చినా నిర్ణయలక్ష్యాన్ని తప్పక చేరుకోగలము.

"ఎవరైతే ఇతరులను సుఖింపచేస్తారో
వారుగూడా సుఖిస్తారు."

## ౫౫. వ్యవహారము - భక్తి

అందరియందు ఉండేది ఒకేఒక పరమాత్మయని భావించి వ్యవహరిస్తే— అది భక్తిగా మారుతుంది.

'వ్యవహారము-భక్తి', ఈ రెండువేరువేరని భావించకు! ఎంత వరకు శరీరము నిలుస్తుందో, అంతవరకు పిడికెడు అన్నం అవసరమౌతుంది అప్పుడు వ్యవహారమనే వ్యవసాయము చెయ్యడము అవసరమే కదా ?

అందుకని వ్యవహారకృషి సలుపు? వ్యవహరిస్తూగూడా వివేకాన్ని కోల్పోకు!

భగవంతుడు ఏ వృత్తిని ఏర్పాటుచేస్తాడో దానిని వదలిపెట్టకు! వృత్తి మానుకుంటే భక్తి కుదురుతుందని అనుకోవడము శుద్ధతప్పు.

పనిచేస్తే 'పాపము' వస్తుందనుకోవడము పొరపాటు. ఉచిత భోజనంచేస్తే వస్తుంది.

మహాత్ములుగూడా పనిచేసి జీవించారు. 'గోరాకుంబర్' మట్టిపాత్రలు, నామదేవుడు దర్జీపనిచేసి జీవించలేదా ?

అందుకని మన వృత్తిధర్మాన్ని విస్మరించకు ?

"పుత్రునితో కాదు సద్గతి ప్రాప్తించేది—
నీవాచరించే సత్కర్మలతో?

## 56. పరోక్ష దర్శనం

రాత్రి పన్నెండుగంటల కాలములో దేవాలయంవెళ్ళి దేవుడు నిద్రావస్థయందున్నాడని తలుపులు మూసివుంటే దైవదర్శనంలేకనే తిరిగి రావడము జరుగుతుంది.

ఒకవేళ మనము పరోక్షముగా దర్శించాలని ప్రయత్నిస్తే మన హృదయమందే ఈశ్వరుని దర్శించవచ్చు.

ఆత్మలో పరమాత్మ స్వరూపాన్ని అనుభవించడమే పరోక్ష దర్శనానికి అంతిమ పరాకాష్ఠ!

భగవంతుడు 'గోలోకవాసి'. ఈ జ్ఞానము సాధారణమైన జ్ఞానం. అది మనకు అధిక ప్రయోజనమేమీ కలిగించదు.

నిజమైన కార్యకర్త గోలోకవాసియైన పరమాత్మను తన హృదయ కమలమందు స్థిరపరచుకొని ఆత్మలో పరమాత్మను పొందడం జరుగుతుంది.

"పిండి కొద్ది రొట్టె"— అన్నట్లు ఎంతపనిచేస్తామో అంత ఫలితం దక్కుతుంది.

దుఃఖ-దరిద్రాలు నివృత్తి కావాలంటే, జ్ఞానపూర్వకమైన హస్తములతో ముందుకు సాగాలి.

జ్ఞానాన్ని స్వానుభవములోనికి తెచ్చేదానికి అభ్యాసము అవసరమౌతుంది.

"సృష్టిని కాదు—
సృష్టిని దర్శించె దృష్టిని మార్చు ?"

## 57. క్రియాత్మక ఉపదేశము

ఉపదేశము చేసేటపుడు ఉపదేశకుడు ఈరీతిన ఆలోచించాలి—

"నేను చెప్పేదంతా ఆచరిస్తున్నానా ?"— అని.

సర్వదా 'పూర్ణపూరి' (పూర్ణముతో చేసినది) తినడము అలవాటుగా గల పిల్లవాడిని తల్లి వాడిని బాగుచేయదలచి, ఏకనాధుడనే జ్ఞానిచెంత కరిచి బాలుడు బాగుపడే ఉపాయమును చెప్పమంటుంది. రోజూ సంతృప్తిగా తీపిపదార్థాలారగించే ఆ మహాత్ముడు ఏమని చెప్పగలడు ? ఒకవేళ చెప్పినా ఆ బాలకునిపై ప్రభావము ఎట్లా ఉంటుంది ? అందుకని ఆతల్లిని మరి మూడుదినాల తరువాతవచ్చి కలువమంటాడు. ఇంకెప్పుడు జీవితములో తీపిపదార్థాలనే సేవించనని వ్రతం పూనుతాడు. మూడు దినాలలో తన సంకల్పము ధృడపడుతుంది. ఆ తరువాత బాలకునికి ఉపదేశిస్తాడు. పిల్లవాడు ఉద్ధరింపబడతాడు.

ఇదిచూచిన తల్లి నయనాల్లో కృతజ్ఞతా బిందువులు రాలుతాయి. అయితే ఆమె ఇట్లా అంటుంది— "ఈ చిన్న విషయానికి మూడుదినాలు వాయిదా వెయ్యాలా ? అప్పుడే చెప్పియుంటే సరిపోయేది కదా ?"—అని.

అప్పుడా మహాత్ముడు— "తల్లీ అప్పటికి నేను తీపిపదార్థాలు ఆరగించేదాంట్లో నీ కుమారునికంటే నేను తక్కువేమీకాదు. అందుకని నేనూ మూడుదినాలు తీపిపదార్థాలు ముట్టనని వ్రతం పూనడం జరిగింది. నా సంకల్పం నెరవేరిన తరువాతనే నీ పుత్రునికి ఉపదేశించడం జరిగింది అప్పుడే నీ కుమారునికి ఆమోదయోగ్యమైంది."— ఈ మాటవిన్న ఆ తల్లి కళ్ళనిండా టపటపామని కన్నీళ్ళు రాలడం జరిగింది.

"ఎవరి జ్ఞానం క్రియాత్మకమౌతుందో వారే ఉపదేశించగలరు."
"శరీరాన్ని పరోపకారార్థం, పరమాత్మార్పితం,
సంపూర్ణముగా చేయడమే నిజమైన పిండదానం."

## 58. ప్రేమపరాకాష్ఠ

ప్రత్యక్ష దర్శన విషయమందు గోపికలు ఎంత ఆతురతతో ఆర్రులు చాచుతారంటే శ్రీకృష్ణుని ధ్యానిస్తూ తాము స్త్రీలమనే భేదభావము గూడా మరచిపోతారు.

శ్రీకృష్ణుని వియోగముతో వ్యాకులతతో, భావముగ్న దశయందున్న ఒకానొక సఖితో గోపికలు "సఖి- వ్యర్థంగా కృష్ణుని వెదికేదానికి ఇక్కడా అక్కడా ఎందుకు తిరుగుతావు ? నేను శ్రీకృష్ణ కానా ?- అని అంటారు

అనగా— గోపికలు శ్రీకృష్ణుని దర్శించాలనివెళ్ళి అంతా కృష్ణులై పోతారు. అంతటి మహోన్నత దశలోనికి వారు చేరుకుంటారు.

అందువలననే కృష్ణుడు పంపిన ఉద్ధవుడు నిర్గుణ బ్రహ్మ తత్వాన్ని ఉపదేశము చేయబోతే శ్రీకృష్ణుని వియోగముతో పిచ్చివారై పోయిన గోపికలు భక్తిభావముచేత మునిగినవారై ఇట్లా అంటారు—
"ఉద్ధవా ? స్వారములేని ఒట్టిమాటలేల. ఈ గ్రామనందలి గోపికలకు అదేమీ కాబట్టదు. ఎప్పుడైతే మేము "కృష్ణ-కృష్ణ" యని పవవరించ దం ప్రారంభించామో అప్పుడే ఆయన మా హృదయాలనుండి వెలువడి మా కన్నులముందు సాక్షాత్కరిస్తున్నాడు."
"ఇది ఎంతటి ప్రేమ పరాకాష్ఠ"

"హృదయము భాగపూర్ణమైతే పరమాత్మని ఎదుట
ద్రవీభూతమౌతుంది.
తరువాత అట్టిహృదయమే శాంతిని పొందుతుంది."

## 59. అందరి ఆశీస్సులు

సేవాభావముతో అందరి హృదయాలను ఆకట్టుకొన్న యశోదా నందులకు ఇంకనూ సంతానం కలుగనందున వ్రజవాసులందరూ చాలా చింతిస్తూ ఉంటారు.

"యశోదానందుడి ఇంట్లో ఎట్లా సంతానప్రాప్తి కలుగుతుంది."— పదే పదే ఈ విషయమై వ్రజవాసులంతా చర్చించుకుంటూ ఉంటారు, ప్రతి నిత్యం.

"వ్రజవాసులందరు ఏకాదశి వ్రతమాచరించి, ఆ పుణ్యఫలాన్ని యశోదానందులకు అర్పిస్తే, వారికి పుత్రప్రాప్తి కలుగుతుందని"— పండితుడొకడు తెలియచేస్తాడు.

వ్రజభూమిలో గోప-గోపికలందరూ, ఏకాదశి వ్రతమారంభిస్తారు పెద్దలేకాక చిన్న-చిన్న పసిపిల్లలు వ్రతం చేస్తారు.

"ఈ రీతిన అందరి నిమిత్తము ఎవ్వరైతే సేవచేస్తారో ఆ సేవా ఫలితానికి అందరి ఆశీస్సులు, పొందుతారో, వారి ఆంగనమందు సాక్షాత్తు సర్వేశ్వరుడు అవతరిస్తాడు. అవతరించి నందుని ఇంట్లో ఆనందచ్ఛాయలు వ్యాపింపచేస్తాడు.

"మానవుడు తన కర్తవ్యాన్ని మరచిపోతాడు.
కాని ఈశ్వరుడు మరిచిపోడు."

## 60. భక్తుని ప్రేమ బంధనం

భక్తుని భక్తి తత్వము ఉన్నతమైన శిఖరాలను చేరుకుంటే పరమాత్మ తత్వము అతని స్వాధీనమౌతుంది.

నిజమైన భక్తుని యొక్క ప్రేమ బంధాన్ని ఆ ఈశ్వరుడు గూడా తెంచలేడు.

సుప్రసిద్ధ హిందీ భక్త కవి ఒకరు ఇట్లా అంటాడు.
"బాహ్ చుడా ఏ జాత్ నిబల్ జానికే మోహి ॥
హిరదే తేజబ్ జాహూగే మరద్ బఖానౌ తోహి॥
అనగా-" ఎవ్వరి యొక్క హృదయ కనులయందు.

సతతము పరమాత్మ తత్వాన్ని స్మరణ గాలిస్తూ ఉంటారో అట్టివారికి పరమాత్ముడు 'ఆత్మాను భావము'తో లోనికి వస్తాడు. -అట్టివారి జీవితం ధన్యమౌతుంది.

- ০ -

"ఈశ్వరోపాసన ఋతువులను శుద్ధిచేసేదానిని కాదు
హృదయాన్ని శుద్ధి పరచేందుకు"

## 61. ఘనశ్యామునితో సంబంధము

అనేక పాపకార్యాలుచేసి లక్షలకొలది సంపదను కూడ బెట్టితన సంతానానికి (పుత్రులకు) అప్పగించినా అప్పుడు తండ్రి తీవ్రమైన వేదనను అనుభవిస్తాడు. కుమారుడు మాత్రము తండ్రి సంపాదించిన సంపదను, తన చేతిక్రింకి తెచ్చుకునేదానికి ముందుకు వస్తాడు.

ఈ రీతిన ప్రపంచమున స్వార్థముతో గూడిన ఈ సంబధాలు ఎంత ప్రియమైన వైనా చివరికి దాని పరిణామము కాలకూట విషముగా ఉంటుంది. అంత్య కాలమున పరమాత్మునితోటి ప్రేమగూడ స్వార్థముతో కూడినవై మోసగించేదానికి సిద్ధపడుతాయి అందుకని సంబంధ బాంధవ్యాలు ఘనశ్యామునితో ఏర్పరచుకో ?

o -

"కధా శ్రవణం పుణ్యప్రాప్తికే కాదు-
చెడువృత్తినిగూడా సమాప్తము చేసేందుకు

## 62. అద్భుతమైన మార్గదర్శనము

మానవ జీవితముయొక్క ఉపయోగము ఉన్నతి. సఫలత, అని మనము శ్రీమద్భాగవతమున చూస్తాము.

ఇతర గ్రంథాలలో ఈశ్వరప్రాప్తికొరకు త్యాగముతోపాటు పెద్ద-పెద్ద సాధనలు చూపించడమ జరిగింది. కాని కలియుగ మానవుడు ధనాశాపరుడుగా జీవిస్తాడు. వానికి త్యాగము రుచించదు. అందుకని వ్యాస మహర్షి ప్రత్యేకమైన వస్తు సమర్పణయొక్క సరళ మార్గమును భాగవతముద్వారా తెలియచేశాడు.

"నీవు ఏ వస్తువునూ త్యాగము చెయ్యనక్కరలేదు. కాని అన్ని వస్తువులు పరమాత్మ చరణాల ముందుంచి, ఆ తరువాత భగవంతుని పేర ఉపయోగించుకో ?" అని వ్యాసమహర్షి సూచించాడు.

అంతేకాదు, ఆ మహర్షికూడా ఇంకా ఇట్లా అంటాడు "మానవుడు అడవికి వెళ్ళుతాడు, కాని వానివెంట పడకొండు ఇంద్రియాలు వెళ్ళుతాయి కదా ? మరి ఎట్లా త్యాగం చేస్తాడు ?" అందుచేత మహర్షి అంటాడు అంతా భగవంతుని ప్రీత్యర్థం చెయ్యమంటాడు.

"ఎంత చల్లని మార్గము"

"వివేకముతో కాస్త్రాసుఖాన్ని అనుభవించు.
భక్తితోడి జీవనాన్ని గడిపి భగవత్ప్రాప్తిని పొందు."

## 63. లక్ష్మి రక్షా బంధనము

మూడడుగులు నేలను యాచించిన వామనమూర్తి బలిచక్రవర్తి వాకిలి కావలా కాయవలసి వచ్చింది.

బలిచక్రవర్తి బంధనమండి స్వామిని విడిపించేదానికి శ్రీ మహాలక్ష్మిగూడా 'దాసి' కావలసి వచ్చింది.

బలి లక్ష్మిదేవిని తన తోబుట్టువుగా స్వీకరిస్తాడు. పతివిముక్తి కొరకు ఆదిలక్ష్మిదేవి బలికి శ్రావణ శుక్ల పౌర్ణమి రాఖీ (రక్షా బంధనము) కట్టుతుంది.

రక్షాబంధనము కట్టిన కానుకగా స్వామిని పొందుతుంది లక్ష్మిదేవి. అప్పుడు నారాయణునకు విముక్తి కలుగుతుంది

బలిరాక్షస సంతతికి చెందినవాడు. కాని ఆయన గురు శుక్రాచార్యునికి సేవచేస్తాడు.

"శుక్రాచార్యునికి సేవచెయ్యడమంటే బ్రహ్మచర్యాన్ని పాటించడమన్నమాట"

శుక్రాచార్యుని సేవ అనగా జితేంద్రియ జీవనం! ఎవడు మనస్సును జయిస్తాడో, వాడే జగత్ విజేత. వారింట్లో లక్ష్మినారాయణులు దాసత్వాన్ని స్వీకరిస్తారు.

"కాఫీ సమయానికి లేకుంటే తలనొప్పి వస్తుంది.
మరి అట్టివారికి వేదాంతం ఎట్లా ఒంటపట్టుతుంది ?"

## 61. కామముద్వార మోక్షము

కామాందునికి భగవత్ప్రాప్తి లభిస్తుందని ఏ మతగ్రంథ మందునూ వ్రాసియుండలేదు.

"కామ, క్రోధ, మద, మాత్సర్యాలను" దైవార్పితముగా భావించి, భగవత్ప్రాప్తికొరకు సాధనచెయ్యి." అని భాగవతము మనకు తెలియ చేస్తుంది.

ప్రతిగోపిక శ్రీకృష్ణునియందు ప్రేమకలిగి కామ భావముతో ఉంది. కామము నరకమునకు ద్వారము. కాని ఈ కామభావము భగవంతునితోటి సంబంధము కనుక, గోపికలు నిష్కాములయ్యారు.

భాగవతము జీవునకు మాత్రమే భగవత్ప్రాప్తికలిగించే మార్గము చూపించగలిగిన మార్గదర్శి !

.0.

"తల్లి ఆచార అలవాట్లు
తన సంతానముపై తప్పక ఉంటాయ్."

## 65. రామరాజ్యమా ? కామరాజ్యమా ?

"ఆర్యా ! నేను కోర్టులో గెలిచేటట్లు ఏదైనా మంత్రముపదేశించడం" ఒక సోదరుడు నన్ను అడగడము జరిగింది.

కేసేమిటి ? అని నేను అడగడమూ జరిగింది.

"నా సోదరునిపై దావాచేశాను" అని ఆయన జవాబివ్వడము జరిగింది.

నాకు ఆశ్చర్యము కలిగింది.

ఆ సోదరుడు ప్రతినిత్యం రామాయణం పారాయణం చేస్తాడు. కాని రామునికి. భరతునికిఉన్న బంధుప్రీతి ఆవగింజంతగూడా వాని హృదయములో లేదు.

రోజూ రామాయణం వింటూ ఉన్నావా ? ఐనా నీలో రామునికి భరతునికి ఉన్న బంధుప్రేమ నీ హృదయాన్ని జాగృత పరచలేదా ? అని అన్నాను.

సిగ్గుతో అతడు తలవంచుకున్నాడు.

మనమంతా రామరాజ్యాన్ని కోరుతున్నాం, కాని రామునివంటి అన్నలు. భరతునివంటి సోదరులవలె మనమంతా మారనంతవరకు రామ రాజ్యము రాదు !

నేడు సర్వత్రా రామరాజ్యానికి బదులు కామరాజ్యం వ్యాపించి ఉంది. "ఎంతవరకు మానవ హృదయమందు కామం, స్వార్థం, స్థిరంగా ఉంటాయో అంతవరకు రామరాజ్యం సంభవించడము దుర్లభం.

"ప్రభువియోగమే అన్నింటికంటే పెద్దరోగం.
అన్నిటా ప్రభువును దర్శించడమే ఆరోగ్యానికి ఔషధము "

## 66. మరణించకమునుపే ముక్తి

మరణించకమునుపే ముక్తిని కలిగించే విద్యను మనకు భాగవతము నేర్పుతూ ఉంది. చనిపోయిన తరువాత ముక్తి ఉందా—లేదా ? అది ఎవరు చూశారు ? కనుక మరణంచకమునుపే ముక్తినిపొందే రసాయనాన్ని పొందాలి.

జీవన్ముక్తి పొందేదానికి తాళంచెవి ఏమిటంటే. "భగవంతుని యందు భక్తిభావముతో శరీరాన్ని, సర్వేంద్రియాలను హాజరుపరచడమే!

ఇంటిలో ఉంటూ సంసారిక జీవితాన్ని అనుభవించేవారుకూడా బహ్మానందాన్ని పొంది సుఖముగా కాలము గడపాలంటే, ఉపాయమేమిటని వ్యాసమహర్షికి మదిలో అభిలాష ఉండేది.

అలాంటి ఔషధాన్ని భాగవతముద్వారా పొందడము జరిగింది. భాగవత రచనతో కృతార్థుడై, సంతోషాన్ని పొంది తనలేఖిని (కలము) ప్రక్కన ఉంచాడు వ్యాసమహర్షి.

"నేటి మానవుడు ఇంటిని వదల లేకున్నాడు.
ఇంటిలో ప్రశాంతంగా జీవించలేకున్నాడు."

## 67. గొప్పబంధు ప్రేమ

కైకేయి శ్రీరామ చంద్రుని అరణ్యానికి పొమ్మనేటపుడు రాముడు కైకమ్మతో ఏలాంటి కోపతాపాలు లేకుండా, ఏమంటాడంటే - "తల్లి నీవు నీ మదిలోని మాటలు చెప్పావు. నా సోదరుడు భరతుడు శాశ్వతముగా సుఖముగా ఉండాలనే నా కోరిక. అందుకనీ నేను ఎల్లప్పుడు అరణ్యములో ఉండడానికి సిద్ధముగా ఉన్నాను." - అని అంటారు.

భరతుడూ కూడా శ్రీరాముడు అరణ్య - వాసము చేసినంతవరకు రాజమహల్లో ఉండి కూడా తపస్సు చేశాడు, ఆహారము తీసుకోకుండ !
చెప్పండి ?- నేడు ప్రపంచములో ఇలాంటి గొప్ప బంధు ప్రీతి కనుపిస్తూ ఉందా !

నేడు రామాయణాన్ని పారాయణము చేసేవారు. శ్రీరామ కథని వినేవారు, జగడాలతో కోర్టు-కెక్కుతున్నారు. స్వరనాశనమౌతూ ఉన్నారు. ఎంత ఆశ్చర్యము !!

"కాషాయవస్త్రం ధరించినవాడు కాదు-
హృదయాన్ని కాషాయరంగుగా మార్చినవాడు
పరమహంస !"

## 68. పవిత్ర దాంపత్యము

మనువు-శతరూప, ఈ దంపతులు తమ కుమార్తెయైన దేవహూతిని కర్దము ఋషితో పాణిగ్రహణం చేయించేటపుడు, ఋషి కర్దము ఉంటాడు. "పత్నితో సత్యాంగత్యం, ఆత్మసుఖప్రాప్తి కొరకు వివాహము చేసుకుంటాను. కాని భోగవిలాసాలకు కాదు. నాకు భోగపత్ని కాదు కావలసింది- ధర్మపత్ని. మా సంబంధము సంసారము చేసేదానికి కాదు నావ-నావను నడుపు సొరంగులాగా సంసార సాగరాన్ని దాటేదానికి. ఆ తరువాత ఒక పుత్రుడు కలిగాక సన్యసిస్తాను. ఇది మీకూ సమ్మతమేనా ? అని అంటాడు.

'మను-శతరూప' ఇద్దరూ పెద్దచిక్కుల్లో పడతారు. కాని దేవహూతి తపస్వియొక్క సేవను స్వీకరించి వల్కల వస్త్రాలను ధరిస్తుంది.

వివాహనంతరము దంపతులిద్దరు పన్నెండేండ్లు బ్రహ్మచర్యవ్రతమాచరించి పత్ని, పతిసేవా వ్రతాన్ని నిర్వహించింది

సేవతో సంతోషాన్ని పొందిన కర్దముడు భార్యను ఏదైనా వరము కోరుకొమ్మంటాడు. అప్పుడు దేవహూతి "నాకు వేరే ఏ కోరికాలేదు నీచేయి పట్టుకొని పరమాత్మ సన్నిధికైనా వస్తాను." అని అంటుంది.

అంతటి పవిత్ర దాంపత్యంగల గృహంబున కపిల మహర్షి పుత్రరూపము దాల్చుతాడు.

వివాహ విషయమున ఎంతటి సుందరజీవ దృషియో !

"సంయమనము-సదాచారముతోనే జీవితముతో
శాంతి-సంతోషాలు అనుభవప్రాప్తికి వస్తాయి.

## 69. ప్రభువు పూచి

ఇంటిలో దేవతల చిత్రపటాలు, విగ్రహాలను దీపారాధనకు, ఆరతినిచ్చేందుకే వినియోగించకు. గృహములోని ఇతర సభ్యులవలెనే పరమాత్మునియందును ఆత్మీయత కలిగియుండి సేవచేస్తూ, ఈ ఇల్లు భగవంతుడిదేననే భావముతో మెలగాలి. మనమంతా ప్రభుప్రేరణతో నడిచే దాసులము.

ఎప్పుడైనా ఏదైనా కార్యార్థం ఇల్లు వదలవలసివస్తే, "హే ప్రభూ నీ కార్యార్థం కొరకే బయట వెళ్లుతున్నాను. అంతవరకు నాతోనే గడిపి కాపాడు." అని నీవు భగవంతుని తొలి వినయముగా అర్థించాలి.

మళ్లీ వెలుపలినుండి ఇంట్లోకి తిరిగి రాగానే దైవసన్నిధిచేరి వందనమాచరించి "స్వామి నేను వెళ్ళినపని పూర్తిచేసుకొని మీ చరణాల చెంతకు తిరిగి రాగలిగినాను ధన్యుణ్ని." అని విన్నవించుకోవాలి.

ఈ రీతిన భగవంతునితో ఆదరణీయముగా వ్యవహరిస్తే ప్రతి పనిలోనూ ప్రభువు సఫలీకృతము చేస్తాడు.

గృహ కృత్యాల్లో మన అవసరాలకు ప్రభువును యాచిస్తే తప్పక ప్రసాదిస్తాడు.

"శరీరాన్ని బాగుచేసుకో ఐతేశరీరము వేరనే భావముతో జీవించు."

## 70. వృత్తియే నా గురువు

గొప్ప గొప్ప జ్ఞానులు, గొప్ప గొప్ప భక్తులు వ్యాపారవృత్తిని నిర్వహించుతూకూడా ప్రభు ప్రాప్తిని పొందకలిగారు. వ్యాపారము చేస్తూ ఉన్నా, కొనుగోలుదారునిలో కూడా భగవంతుని దర్శించే వృత్తి, భక్తిమయమౌతుంది.

నామదేవుడు 'దర్జీ' పని చేసేవాడు. కోరాకుంభర్ మట్టితో పాత్రలు చేసేవాడు. కబీర్ 'నేత' నేసేవాడు. వారందరూ, వారి వారి వృత్తిధర్మాన్ని నెరవేర్చుతూ అన్నిటా పరమాత్మను దర్శించి పరమాత్మ భావాన్ని పొందియున్నారు.

ఒకమారు ఆకాశవాణి "జాజలి ఋషి" కి ఇట్లా ఆజ్ఞాపిస్తుంది. "సత్సంగము చెయ్యాలని ఉంటే జనకపురివెళ్ళి త్రాసునుపట్టిన వైశ్యుని కలువమని".

మహర్షి 'జాజలి' జనకపురి వెళ్ళునప్పటికి ఆ వైశ్యుడు దుకాణ మందు కూర్చొనియుంటాడు. 'ఆకాశవాణి ఆదేశానుసారము వచ్చారు కదూ ? అని ప్రశ్నిస్తాడు.

ఆ పలుకులు వినగానే జాజలి మహర్షి ఆశ్చర్యముతో మీ గురువు ఎవరని అడుగుతాడు.

అందులకా వైశ్యుడు "నా వృత్తియే నా గురువు అని అంటాడు. త్రాసు-దండం (తక్కెడ) వలె నేనూ నా మదిలోని విషయ వాసనలను సమానముగా చూస్తున్నాను. ఒకరికి తక్కువ తూచడముగాని. మరొకరికి ఎక్కువ తూచడముగాని చెయ్యడములేదు. ఎందుకంటారా ? బేరగాడు కూడా పరమాత్మనియొక్క అంశమేకదా ? నా తల్లిదండ్రులను ఈశ్వర స్వరూపులుగా భావించి వారిసేవ చేస్తున్నాను. పరమాత్మని తలచు కొంటూ ఉన్నాను." అని వివరిస్తాడు.

జాజలిమహర్షి వైశ్యునికి నమస్కరిస్తాడు.

ప్రతిచోట, ప్రతిక్షణం, పరమాత్మను తలచుకునేవాని వ్యాపారము కూడా పరమాత్మను పొందేదానికి సాధనమౌతుంది.

"ఎవని చిత్తం సంసారిక సుఖాలలో మునిగి తేలుతుందో
బ్రహ్మానందములోని ఆనందము వానికెట్లా తెలుస్తుంది ?"

## 71. భాగవత చోరుడు

కొందరు దొంగలు జైల్లో ఉంటారు. మరికొందరు మేడల్లో ఉంటారు.

జైల్లో ఉన్నవారు పాపప్రక్షాళనము గావించుకుంటారు. మేడల్లో ఉన్నవారు పాపాన్ని వృద్ధిచేసుకుంటారు. పాపభాండము ఎప్పుడు నిండుతుందో అప్పుడు మేడల్లో ఉండేవారు జైల్లోని వారికంటేకూడా అధికమైన శిక్షను పొందుతారు.

మేడల్లో ఉంటూ దొరలా జీవించే దొంగలనుగూర్చి శాస్త్రాల్లో జ్ఞానులు ఇట్లా నిర్వచిస్తారు.

(1) సంపదనంతా హరించివేసే దొంగ,

(2) జన్మదాతలైన తల్లి-దండ్రుల సేవచేయనట్టి చోరులు

(3) పరమాత్ముని మరచి భోజనంచేసే చోరుడు

(4) ఆప్తుల (స్వజనుల) దుఃఖాన్ని చూచికూడా కన్నీరు కార్చక నిశ్చింతగా నిద్రించే చోరులు. వీరంతా భగవత్ చోరులనబడుతారు. ఎందుకంటారా- "పరమాత్మ దేనికైతే కాళ్ళు చేతులు, ధనధాన్యాలనిచ్చాడో వాటిని పూర్తిగా విస్మరించినందులకు !!"

చెప్పండి మరి- సమాజములో దొంగలకు జైలుశిక్ష విధిస్తే- భగవత్ చోరులకు ఏ శిక్ష విధించాలి? అసలు వారి దశ ఏమిటి ?

"తాంబూల రసాన్ని ఇంపుగా సేవించేవారికి
భక్తిరసం ఎట్లా సహిస్తుంది ?"

## 72. యశోదానందులు

మధురమైన పలుకులతో వినయ-విధేయలతో స్నేహ సద్భావాలతో సేవచేస్తూ అందరిని ఆనందింపచేసేవానిని "నందు" డంటారు.

స్వయంగా కష్టపడి పనిచేసి ఆ కష్టార్జిత యశఃఫలాన్ని పరులకు దారపోసేవారిని "యశోద" అని అంటారు.

తమకు కలిగిన పుణ్యఫలం- ఇతరుల ఆశీర్వాద ఫలమని భావించి వినయముతో మెలిగేవారిని "యశోద" అని అంటారు.

వారిసేవ ఎంత ఉన్నతమైనదంటే- అందరి కన్నులు చెమ్మగిల్లుతాయి ఆనందముతో ! ఏ ఇంట ఏ పిల్లవానికైనా జబ్బుచేస్తే వారింటికి పరుగులుతీసి వారి శోకాన్ని తొలగిస్తారు.

అంతటి సేవాభావము కలిగినవారికి శుభం కలుగాలని ఎల్లరు ఎల్లప్పుడు కాంక్షిస్తారు.

వారిపై ఎల్లవేళలా అందరి ఆశీర్వాదామృతము కురుస్తూ ఉంటుంది.

అటువంటి సుయోగ్యమైన దంపతుల ఇంటిలో సర్వేశ్వరుడు శిశువుగా ఉదయిస్తాడు.

"ప్రతి వస్తువును పరమాత్మార్పితం గావించు ఆ తరువాత ప్రభువు ప్రసాద రూపములో తిరిగి గ్రహించు !"

## 73. బర్ఫీ - టీ

నీ ఇంద్రియాలశక్తి సంసారిక విషయాలలో ప్రభావితమై నష్ట పడుతూ ఉంది.

ఈలాంటి నష్టాన్ని నివారించి ప్రభువువైపు మళ్ళించు !

ఇట్లా చేయడముచేత ఇంద్రియ నిగ్రహము కలిగి పరమాత్ముని ప్రేమకు అర్హులమౌతాము.

'బర్ఫీ' ని తిన్న తరువాత 'టీ' ని సేవిస్తే ఆ రుచి ఏర్పడుతుందా-లేదా ?

ఈ మాదిరి ఇంద్రియాలు భగవత్ రసాస్వాధన చేసిన తరువాత జగత్తులోని లౌకిక రసాలన్నీ నిస్సారముగా రుచిస్తాయి. నీ ఇంద్రియాలు విషయ వాసనలనెడి బంధాలనుండి విముక్తిని పొందుతాయి.

ఇంద్రియాలను పరమాత్ముని దారిలోనికి మళ్ళించుటకు ఇదే చుక్కాని !

ఈ చుక్కాని ద్వారా జీవితాన్ని సుఖమయం చేసుకో ?

"ఈ ఇల్లు నీది కాదు. ప్రభు మందిరం మాత్రమే!
ఆ భావముతో అందులో నివసించు."

## 74. నంద మహోత్సవము

ఎవ్వరైతే సర్వులకు సేవచేసి ఆనందాన్ని పొందుతారో. వారే అందరి ఆశీస్సులు పొందేటందుకు అర్హులు. అందరి ఆశీస్సులు పొందదము చాలా కష్టం.

అందరి ఆశీర్వాదములు పొందలేదేనని, చింతించనక్కరలేదు. కాని అందరి శాపనార్థాలకు గురి కాకుండా చూచుకో ?

వ్రజవాసులందరి ఆశీస్సులు యశోదానందుల పైనుండుట చేతనే ఈశ్వరకృప వారి ఒడిలో అడుకుంది

యశోదానందులు నిస్వార్థముతో సర్వులకు సేవచేసి సర్వుల యందు సమాన ప్రేమాభిమానాలతో మెలగడము జరిగింది కనుకనే అందరి హృదయాలు వారి కొరకు సద్భావముతో ఆశీస్సులు కురిపించాయి మనము కూడా అందరి యందు, యశోదానందులవలె స్నేహ భావము సేవా భావము, సద్భావము, కలిగియుండాలి. అట్లా ఆచరిస్తే అందరి కన్నులు మన కొరకు అమృతాన్ని కురిపిస్తాయి. ఆశీస్సులు మన జీవితాల సార్థకం చేస్తాయి. మన ఇంటిలోని ఆనందోత్సవము అదంరికి ఆనందము ప్రసాదించే నంద మహోత్సమౌతుంది.

"మానవుడు యజమాని కాదు-
ప్రభువుకు సేవకుడు."

## 75. సద్భావము

ఎవ్వడైతే భగవంతుని చరణాలముందు సర్వదా సద్భావముతో మెలగుతాడో, ప్రభు నిర్ణయాలను ఆనందముతో స్వీకరిస్తాడో ప్రభువే సర్వస్వమని ఎవడు తలుస్తాడో, అట్టివానికిసర్వాధికారాలు ప్రాప్తిస్తాయి.

వినయము, విధేయతలేకుంటే ఎవ్వరికీ ఈ భావాలు ఉదయించవు. ఎక్కడఅహంకారముంటుందో, అక్కడ సద్భావము నిలిచేదానికి ఆస్కారము లేదు.

ఎవ్వడైతే మానవుడు తానుచేసిన పొరపాటును సరిదిద్దుకునేదానికి ప్రయత్నిస్తాడో, వినయాన్ని హృదయపూర్వకముగా మదిలోనికి ఆహ్వానిస్తాడో, అప్పుడే సద్భావము మదిలో నిండుకుంటుంది.

నేటి మానవుడు తప్పిదమును గుర్తించదములేదు. పైగా ఆ పొరపాట్లను కప్పిపుచ్చుకుంటున్నాడు, కనుక వినయ-విధేయతలకు ఇంక హృదయమునందు చోటెక్కడుంటుంది ?

మరి ఈ వినయ విధేయతలే లేకుంటే ప్రభుచరణాలపై అనురాగము ఎట్లా కలుగుతుంది ? సద్భావన ఎట్లా కలుగుతుంది ?

"ఏ మానవుడైతే ఇచ్చిపుచ్చుకోవడములో గోలచేస్తాడో
వాడు భయభీతుడౌతాడు."

## 76. ప్రేమ సన్యాసిని

"గోపిక కేవలము వస్త్రసన్యాసినీయే కాదు, ప్రేమ సన్యాసినీ గూడా." ఆమె హృదయము హరిమయము.

ఇంటియందామె గృహకృత్యాలు నిర్వహించుతూ ఉన్నా, శ్రీ కృష్ణనామస్మరణలో మునిగి తేలుతూ, పరమాత్మను ప్రసన్నం గావించేందుకు సింగారించుకునేది. ఏలాంటి కామవాసనలు దరిదాపులకు దాని చేరదికాదు.

గోపికయొక్క శృంగార చేష్టలన్నీ లౌకిక వాసనలకు లోనై కాదు. భక్తికొరకు !

నిర్వికారముతో కూడిన శృంగారచేష్టలు గూడా 'ప్రభుభక్తియని' అనిపించుకుంటాయి.

గోపికచేసే ప్రతికార్యము ప్రతి వ్యవహారము అంతాగూడా భక్తి మయమే !

భక్తి- వ్యవహారము వేరువేరని (భిన్నమని) భావించవద్దు. పెదవులపై చూపెడి భక్తి, వ్యవహారము మంచిదికాదు-

"నీవు ఏ పనినైతే చేసేదానికి ఉపక్రమిస్తావో-
లేక ఎవరిద్వారా జీవిస్తున్నావో-
అదంతా ఈశ్వర కృపయేనని తెలుసుకో !!"

## 77. యవ్వనము - నిగ్రహము

యవ్వనదశలో మెల్లమెల్లగా నిగ్రహాన్ని పెంపొందించుకొని, భక్తిని అలవరచుకుంటే వారి జీవితమున భగవత్ప్రాప్తి కలుగుతుంది.

ఎవ్వరియొక్క జీవితము భోగవిలాసాలవెనుక పరుగులుతీస్తూ ఉంటుందో— వారి జీవితాలకు ప్రభుప్రాప్తి ఎట్లా కలుగుతుంది ?

ఒకవేళ ఆ జీవి వృద్ధాప్యములో భక్తి మార్గములో పయనిస్తే మరో జన్మలో తప్పక మంచి మార్గములో నడిచేదానికి ఆస్కారముంది. కాని వర్తమాన జీవితములో పరమాత్మ దర్శనము ప్రాప్తిస్తుందా ? లేదా ? అనేదే అనుమానం ?

కనుక వర్తమాన జీవితములో బాగుపడాలన్నా, ఒకే ఓక ఉపాయము— "యవ్వన కాలమున వివేకముతో ఇంద్రియ నిగ్రహం కలిగి యుండటం."

"ఎవ్వని హృదయము విశాలమో ఎవని నయనాలు స్నేహ భావముతో ఉంటాయో వాడే పరమాత్మని కృపకు పాత్రుడౌతాడు.

## 78. దయ

ఏ మానవుడైనా సన్యసించి యోగాభ్యాసముచేస్తే భక్తి ప్రాప్తిస్తుంది.

కాని ఏ జీవిపైనైతే పరమాత్మని దృష్టిపడుతుందో ఆ జీవి (మానవుడు) సన్యసించనక్కరలేదు. యోగి కానక్కరలేకనే జీవన్ముక్తిని పొందగలడు.

దయ (కృప) అంత దివ్యమైనది.

అన్నిరకాల సాధనలు చేస్తూగూడా అహంకార రహితులై దీనావస్థలో ప్రభుచరణాలం నాశ్రయిస్తారో అట్టివారిపై భగవత్ కృప అవతరిస్తుంది.

మదిలోని మాలిన్యము కన్నీటిచే కడుగబడుతుంది.

భగవంతుని కరుణా కటాక్షానికి ఎవ్వరైతే రోధిస్తారో అట్టివారికి భగవంతుడు కనికరిస్తాడు.

"పరమాత్మ సన్నిధికి ఎవరు చేర్చుతారో వారు పరమాత్ముని కంటే శ్రేష్ఠులుగా ఎంచబడుతారు."

## 79. ప్రేమ నిషా

గోపిక ఎక్కడవెళ్లినా, ఎక్కడ నిలిచినా, సర్వత్రా పరమాత్మ స్వరూపాన్ని దర్శించడము జరుగుతుంది. అందుచేత ఆత్మతోగూడా తన కన్నయ్య సాన్నిధ్యములో ఆనందానుభూతిని పొందగలుగుతుంది,

ఈ ప్రేమ నిషా (కైపు) తో ఉద్ధవునితో "నా కృష్ణుడు నన్నెన్నడూ విడనాడి ఎక్కడా వెళ్లడు వెళ్లబోడు." అని అంటుంది.

అంతటి ఉన్నతమైన ప్రేమ ఎక్కడ ఉంటుందో, అక్కడే పరమాత్మ ప్రత్యక్షమౌతాడు.

నిజమైన ప్రేమయే అయితే ప్రేయసిని ప్రియుడు వదలి ఉండలేడు కదా ?

- o -

"భగవంతుని జ్యోతిర్ చేసే పవిత్ర దినం
మృత్యు దినమే."

## 80. అనాసక్తి

రావణుని చెడు ప్రవర్తన చూచిన విభీషణుడు చాలా వ్యాకులత చెంది, శ్రీరామ చంద్రుని శరణు వేడుకుంటాడు. అప్పుడు రామ చంద్రుడు "లంకాధిపతికి స్వాగతం" అని అంటూ ఎంతో ప్రేమతో పిలుస్తాడు. రావణవధ జరగకమునుపే విభీషణునకు పట్టాభిషేకము జరిపిస్తాడు శ్రీరాముడు.

సుగ్రీవునకు అనుమానము కలిగి రాముని ఇట్లా ప్రశ్నిస్తాడు— "ఒకవేళ రావణుడుగూడా విభీషణునివలెనె నిన్ను శరణు వేడితే అప్పుడేం చేస్తావు? ముందుగానే విభీషణునికి రాజ్యాభిషేకము జరిపించినావే. వెనుక వచ్చిన రావణు ని ఏమిచేస్తావు?

అందుకు శ్రీరామచంద్రుడు అత్యంత స్నేహభావముతో, సహృదయముతో ఇట్లా అంటాడు "రామోద్విర్న భాషతే" రాముని బాణమువలె రాముని మాట (వచనము) గూడా ఒకటే. విభీషణునివలె రావణుడు శరను జొచ్చినచో విభీషణుని రాజ్యాన్ని ఆశించక రావణునికి అయోధ్యను అప్పగించి స్వతహాగా అరణ్య రాజ్యాన్ని అనుభవిస్తానంటాడు.

ఎంతటి ఉదారత!

ఎంతటి అనాసక్తి!!

"పవిత్ర తీర్థస్థానమందు చేసిన సత్కర్మ
అధిక శ్రేయస్కరమౌతుంది."

## 81. పాపము

అంపశయ్యపై పరున్న భీష్మునితో శ్రీకృష్ణ పరమాత్మ— "నీవు ఏ పాపకార్యము చేసి ఎరుగవు. అందుకని అంత్యకాలమున నిన్ను కలిసేదానికి వచ్చాను. దుర్యోధనుని నిండు సభలో దుశ్శాసనునిచే ద్రౌపతిని వివస్త్రనుచేసే పాపకార్యము నీవు చూశావు. చూచిగూడా నీవు మందలించలేకపోయావు. అందుకే నీకీ శిక్ష. మీ (కురు) కులములోని బంధువులచేత, పుత్రులచేత, న్యాయానికి అన్యాయము జరుగుతూ ఉంటే ఉపేక్షా భావముతో నీవు ఉండిపోయావు ఇది క్షమింపరానిది. దుర్యోధనుని ఇంట్లో ఉంటూ, వాని ఉప్పుపులుసు తింటూ భ్రష్టుడవై ఆనాటి సభలో మౌనముగా ఉండిపోయావు." అని అంటాడు.

ఏ సభలోనైనా పాపకార్యము జరుగుతూ ఉన్నచో ఆ సమయమందు నీవక్కడ ఉపస్థితుడవై, మౌనముగా ఉన్నచో అది నీకు సమ్మతమేనని చాటుతుంది. అట్లా ఆచరిస్తే ఆ పాప పలము నీకు అంటుకుంటుంది.

"పాపాన్ని చూడకు. ఏ పాపపు పలుకులు వినకు. లేకుంటే ఆ పాపము నిన్ను భ్రష్టుపట్టిస్తుంది.

"ఎవ్వడైతే పుణ్యకార్యాల్లో కలిసి సహాయము చేస్తాడో.
వాడు పుణ్యానికి పాత్రుడౌతాడు."

## 82: మనస్సునే గురువుగా చేసుకో

యోగి తన మనస్సును బలవత్తరముగా వశములో నుంచుకొనుటకు ప్రయత్నిస్తాడు. ఐనా అది పూర్తిగా వశముగాదు. అప్పుడప్పుడు మోసమూ చేస్తుంది.

కాని వైష్ణవ భక్తులు బలాత్కారముతో గాక, ప్రేమతో మనస్సును వశపరుచుకుంటారు.

నీ మనస్సును నీవు గురువుగా చేసుకో. ఇతరులనెవ్వరినో గురువుగా చేసుకొని క్రొత్తసమస్యలు తెచ్చుకునే బదులు నీ మనస్సునే గరువుగా నెన్నుకొని బాగుపడు!. ఎందుకంటావా ? నీవు ఎట్లా భావిస్తే, అట్లా చేస్తావు కనుక.

స్వామి రామదాసు తన మనస్సుకు ఎట్లా బోధ చేశాడో, ఆప్రకారము నీవు గూడా మనస్సుకు మంచి బోధ చెయ్యి ?.

- o -

"భగవంతుడు మనకు ఏ స్థితి కలిగిస్తాడో
దానితో సంతోషించడము నేర్చుకుంటే సుఖిస్తావు."

## 83. వక్తగా మారిపో

కథవిని ఇంటికి వెళ్ళేముందు వక్తగామారి, మనస్సును శ్రోతగా చెయ్యి.

సంసారిక రసానుభూతిని పొందడము మంచిదికాదు. అది విష ముతో కలుషితమైనదని మనస్సుకు ప్రేమతో ఓదార్చి తెలియచెయ్యి?

మనస్సుకు తెలియపరచిన తరువాతగూడా విషాన్ని గ్రోలినచో మృత్యువు సంభవిస్తుంది, సంసారిక విషయ వాసనలచేత అధోగతి ప్రాప్తిస్తుంది.

సంసారిక విషయ వాసనలు విషముకంటే గూడా అధికప్రమాద కరమైనవని మనస్సుకు తెలియచెయ్యి?

కనుక విషయ వాసనలనుండి విముక్తి కలగాలంటే విశ్వనాధుని చరణారవిందాలను శరణువేడుకో?

ఎందుకా? విశ్వనాధుని చరణారవిందాలయందు విషయవాసనలనే "విషం" నుండి కాపాడే జీవన సంజీవని ఉంది కనుక !!

" మానవుడు మెలుకువగానే ఉంటాడు.

కాని

గాయం తగరందే వానిలో మెలుకువరాదు."

## 84. ప్రేమతో తెలియపరచు

సర్వేంద్రియాల కన్నింటికి ప్రేమతో నీవు తెలియపరచి, విషయ వాసనల మార్గము నుండి మళ్ళించి వాటిని పరమాత్మని వైపు మళ్ళించు.

ప్రపంచములోని రూపు రేఖల వెంటబడి తిరగవద్దని నీ కన్నులతో చెప్పు. ఎందుకా ? శ్రీ కృష్ణుని రూపు రేఖలు కళ్యాణాన్ని కలిగిస్తాయి.

చెవులకు తెలియచెయ్యి. నిందావాక్యాలు విని సంసారిక 'విష యము'ను చవి చూడవద్దని, ఎందుకా ? శ్రీకృష్ణుని వేణూనాదములో కీర్తనా శ్రవణములో జీవిత శ్రేయస్సు ఇమిడి ఉంది.

జిహ్వకు తెలియపరచు. ఎవ్వరిని నిందించవద్దని. ఎందుకనగా శ్రీకృష్ణుని గుణగణాలను గానముచేసి ప్రసాదము గ్రహించుటచేత శుభం చేకూరుతుంది.

ఈ రీతిన నీ చర్మానికి, నీ నాసిక కు, ముద్దు - ముద్దుగా తెలియ పరచి ప్రభు మార్గము లోనికి నడిపించు ?

"కన్నులు, చెవులు, అను వాకిండ్లముందు,
సాత్వికులైన కావలావారులని నియమించు."

## 85. ధనము - శాంతి

ధనాన్ని సంపాదించడము కష్టమేమీ కాదు. కాని ఆ ధనమును సదువయోగము చేయడమే చాలా కష్టం.

ధనాన్ని సరిగా ఉపయోగించినపుడే శాంతి లభిస్తుంది. అట్లా సదుపయోగము కానిచో లక్ష్మి శాపనార్థ మిడుతుంది.

లక్ష్మిని భోగవిలాసాలకు కాదు. సదుపయోగం కొరకని జ్ఞాపక ముంచుకో ?

మానవుడెంత ధనవంతుడైనా, "లక్ష్మీపతి" కాలేడు. లక్ష్మీ పుత్రుడే !

"లక్ష్మీదేవిని తల్లిగా భావించి వివేకముతో ఉపయోగిస్తే, ఆమె సంతసించి నారాయణుని ఒడిలో నిన్ను కూర్చుండచేస్తుంది.

అట్లాకాక లోభిగా వ్యవహరించి లక్ష్మిపై అధికారము చెలాయించితే హిరణ్యాక్షునివలె చంపిపారేస్తుంది.

- 0 -

"మృత్యువాత పడ్డప్పుడు' జీవితములో చేసిన మంచి చెడ్డలూ పాపపుణ్యాలు నీ వెంట వస్తాయి."

## 86. లోభి - సంతోషి

హిరణ్యాక్షుని నాశన మొనరించి వరహావతారముతో నారాయణు డు భూమాతను కాపాడడము జరిగింది. ఈ కథను మనము భాగవత మున చూస్తాము.

హిరణ్యాక్షుడనగా, బంగారు - సంపదలపై కన్నులుంచిన 'లోభి'యని అర్థం.

తనను అర్థించిన వారిని ఆదరించి సంతోషపరచువాడు 'వరాహు' దని అర్థం.

సంతోషం ద్వారా లోభం నాశనమౌతుంది. అప్పుడు జీవితానికి శాంతి లభిస్తుంది.

ఎంతవరకు లోభం మనలను వదలదో అంతవరకు సత్కర్మ చెయ్యాలనే తలంపు మనకు కలగదు. ఎవరు వచ్చి కలిసినా పలుకరించినా, సంతోషముండదు.

ఎవరు కలువకున్నా, పలుకరించకున్నా, అదే మేలను కుంటాడు లోభి. లోభత్వాన్ని అంటిపెట్టుకుని తిరిగే వారి జీవితము శాంతిని కోల్పోతుంది. ఏ వ్యక్తియైతే లోభత్వాన్ని వదలడో - ఆవ్యక్తి సత్కర్మ చెయ్య జాలడు.

లోభాన్ని వదలి సంతోషముగా జీవితాన్ని గడుపుతూఉంటే సత్కర్మ చెయ్యాలనే తలంపు కలుగుతుంది. సర్వేశ్వరుని ప్రాప్తికలు గుతుంది.

"మనస్సుపై అంధవిశ్వాసం కలిగినవాడు
చివరికి చిక్కులపాలౌతాడు."

## 87. మృత్యు భయం

మనమంతా ఒకానొకరోజు తప్పక చనిపోవాలి. ఇది అందరికి తెలిసిన విషయమే. కాని మనుజుడు పాపముచేస్తాడు— మృత్యువును మరచి!

మదిలో మృత్యుభయం సర్వదా మెదులుతూ ఉంటే పాపపుదారుల నడువడు. తప్పక మంచిదారికి వస్తాడు.

మరణదండన విధించిన ఖైదీకి మిఠాయినందించినచో అదివానికి రుచించదు. అప్పుడు వానికి భగవంతుడు జ్ఞాపకానికి వస్తాడు.

మృత్యు సమయములో అధికబాధలు కలుగుతాయి. వేలకొలది తేళ్ళు ఒక్కసారి కలిసి కాటువేస్తే, ఎట్లా మరచిపోతాడు?

మృత్యుముఖాన పడ్డప్పుడున్న ఈ ఆవేదన, ఎల్లప్పుడూ మదిలో మెదిలినచో పాపకృత్యాలు చేసేదానికి మరి ఎట్లా యోచిస్తాడు?

జనన మరణాలు, వృద్ధాప్యము సుఖదుఃఖాలు, సర్వదా మానవుడు జ్ఞప్తియందుంచుకుంటే పాపకృత్యాలు ఎప్పుడూ చెయ్యడు.

యమదూతలు ఇప్పుడేవచ్చి తీసుకవెళ్ళితే స్వర్గప్రాప్తి కలుగునా? లేక నరకము లభించునా? అనే విచారణ జీవితమున కలిగితే పాపము నుండి రక్షింపబడుతాడు.

"మృత్యువు తలపై కూర్చునియున్నాడు" అనే భావనతో సతతము సావధానుడవై యుండు!

"ఏలాంటి సత్కార్యము చెయ్యకుండానే ఎవ్వడైతే బోంచేస్తాడో వాడు పాపాన్ని బోంచేసిన వాడౌతాడు."

## 88. కాలానికి దాసుడు

ఉత్తర గర్భాన్ని నాశనము గావించేందుకు అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. ఉత్తర పరమాత్మని ప్రార్థిస్తుంది. నారాయణుడు సుదర్శన చక్రముతో ఆ అస్త్రాన్ని నిరోధించి గర్భములోని 'పరీక్షితుని' రక్షిస్తాడు.

మనమందరమూ పరీక్షితులమే. మనలందరినీ పరమాత్ముడు రక్షిస్తున్నాడు

పిల్లల రక్షణ తల్లి దండ్రులు కాదు- పరమాత్ముడు రక్షిస్తున్నా వ్యాధిగ్రస్తుని డాక్టర్ కాదు రక్షించేది ఈశ్వరుడు.

డాక్టర్ రోగుల రక్షిస్తూఉంటే. స్వతహాగా తాను ఎంటుకు రక్షించుకోలేడూ ?

మానవునికి ఎవరిని రక్షించే శక్తిలేదు. మనిషి కాలానికి దాసుడు మాత్రమే. మరి మానవుడు ఇతరులన్నెట్లు కాపాడగలడు?

"స్నానంతో శరీరశుద్ధి,
ధ్యానంతో మనస్సు శుద్ధి,
దానంతో ధనము శుద్ధిపడుతుంది."

## 89. బీరువా తాళంచెవి

మన గృహానికి మనల్ని కలిసేదానికి ఎవరైనావస్తే మనం ఇంటి వాకిండ్లన్నీ తెరచి కుటుంబ విషయాలన్నీ తెలియచేస్తాము. కాని ఇనుప పెట్టె (బీరువా) తెరచి బంగారు- డబ్బు ఇత్యాదిగుప్త సంపద చూపిస్తామా? గుప్త ధనము కేవలము భార్యా-సుతులకు మాత్రమే పరిమితము చేస్తాము.

జీవుడు ఈ రీతిన పరమాత్మునితో, ప్రేమతోగూడిన సంబంధము లేకుంటే "మాయ" అను తెరవెనుక దాగియున్న భగవంతునియొక్క పూర్ణరూపాన్ని తెలుసుకొనజాలడు.

ఏది మనకు అత్యంత ప్రీతిపాత్రమో, దానిని తాళమువేసి జాగ్రత్తగా ఉంచుతామో; అటులనే జీవుడు సంపూర్ణ ప్రేమతో పరమాత్మన్ని నమ్ముతాడో వానికి భగవంతుని పూర్ణరూపము దర్శనమిస్తుంది.

భగవంతునియందు జీవునియొక్క ప్రేమ ఎప్పుడు అధికమౌతుందో— అప్పుడే 'మాయ' అనెడి పరదా తొలగిపోతుంది.

"ధ్యానంయొక్క నిజమైన ఆనందం
ప్రాతఃకాలముననే పొందగలం."

## 90. వెంట్రుక - ప్రాణము

ఏలాంటి శ్రమలేకుండా వెన్నముద్దలోపడిన వెంట్రుకను తీసివేయవచ్చు.

కాని అదే వెంట్రుక ఎండిన పేడలోగాని, మట్టిపెల్లతోగాని అంటుకొనియున్నచో వెలుపలికి తియ్యడము చాలాకష్టం. వెలుపలికి తియ్యాలన్నా వాటిని పగులగొట్టి నలిపితేగాని బయటపడదు.

మానవ జీవితముగూడా అటువంటిదే! జ్ఞాని శరీరములోని 'జీవి' వెన్నముద్దలో చిక్కుకున్న వెంట్రుకతో సమానము. జీవితమున తన కర్తవ్యాన్ని నిర్వహించిన జ్ఞాని ప్రాణాల వదలడములో ఏ కొంచెముగూడా బాధపడడు.

కాని సంసారి శరీరములోని జీవుడు, ఎండినపేడ- లేక మట్టిపిడకలలో తగులుకొన్న వెంట్రుకతో సమానమై, మరణానికి సిద్ధంగాలేక ప్రాణముపోవునపుడు, చాలా వ్యథను అనుభవిస్తాడు. ఆ జీవికి అంటిపెట్టుకొనియున్న వాసనలు వదలక చనిపోయిన తరువాతగూడా వాసనలతోనే మునిగితేలుతూ ఉంటాడు.

"మనస్సు చాలా పరిశుద్ధమైతే అప్పుడే పరమాత్మని
కలవాలనే తలంపు ఉదయిస్తుంది."

## 91. జ్ఞానివి కావాలి

భాగవతము మనల జ్ఞానుల కావాలని ఉపదేశమిస్తుంది. జ్ఞాని వయ్యేందుకు కాషాయవస్త్రాలు ధరించి ఇల్లూ వాకిలి వదలవలసిన అవసరమూలేదని భాగవతము తెలియచేస్తుంది. సాత్విక గుణాలు అలవరచుకుంటే మనిషి తనకు తాను "జ్ఞాని" యై పోతాడు.

నరసింహుడు మీరాబాయి, తుకారాం, వీరంతా ఇల్లువదలి పెట్టారా? కనీసం సాధువేషముగూడా ధరించలేదుకదా? ఐతేవారు జ్ఞానులుకారని ఎవరు చెప్పగలరు?

దైవ నిర్ణయమైన సంసారిక జీవితమును వివేకముతో గడుపుతూ, కాషాయవస్త్రాలు ధరించకున్నా, 'జ్ఞాని' కావచ్చునని మనకు భాగవతము ఉపదేసిస్తుంది. ఆత్మను శుద్ధిపరచుకుంటే జ్ఞానికావచ్చు. వస్త్రాలు మార్చినంత మాత్రమునసే జ్ఞానికాజాలడు.

మనోవాక్కాయకర్మ చిత్తములచే, ఏ పాపము చెయ్యనివాడు జ్ఞాని. అన్ని వ్యవహారాలయందు తలదూర్చి పనిచేయుచున్ననూ మనస్సును స్థిరపరచినవాడే 'జ్ఞాని' ఎవ్వడు ఇతరుల గుణదోషాలను ఎంచడో వాడే జ్ఞాని. అట్టిగుణాలు నీలో ఉంటే జ్ఞానియేకాదు— ఆ సర్వేశ్వరుడు కూడా నీముందువచ్చి నిలుస్తాడు,

"సర్వవేళలా హృదయాన్ని భగవద్భావముతో నింపియుంచే పాపపు వాసనలు నాశనమౌతాయి "

## 92. వక్త - శ్రోత

ఎవని హృదయమైతే జ్ఞానవైరాగ్య భక్తితో పరిపూర్ణమౌతుందో. వానినే ఉత్తమమైన వక్తయని చెప్పుతారు.

కొందరిలో జ్ఞానముంటుంది. మరి కొందరిలో వైరాగ్యముండదు. ఇంకామరికొందరిలో జ్ఞానవైరాగ్యాలు ఉంటాయి. కాని భక్తి ఉండదు.

అట్టి అపరిపక్వ కారణంచేతనే రసమయమైన శబ్దబ్రహ్మయొక్క ఉనికి తెలియదు.

పిండి. నెయ్యి పంచదార, ఈ మూడు సమపాళ్ళలో మేలవించినప్పుడే లడ్డుయొక్క రుచిని చూడగలుగుతాము. ఈ రీతిన జ్ఞానము. భక్తి, వైరాగ్యము, పరిపూర్ణమైనపుడు, ప్రేమభక్తిని ఆస్వాదించగలుగుతాము.

మాతృశుద్ధి, వంశశుద్ధి, ఆత్మశుద్ధి, అన్నశుద్ధి, ద్రవ్యశుద్ధి—అను ఈ పంచశుద్ధులచేత ఎవ్వని జీవితము నిర్మించబడుతుందో— అటువంటి శ్రోతనే ఉత్తమమైన శ్రోత లేక "పరీక్షిత్తు" అని అంటారు. అటువంటి వారికే జ్ఞానము, భక్తి, వైరాగ్యము పరిపూర్ణముగా గల ఉత్తమమైన "వక్త" ప్రాప్తిస్తాడు.

"నోటిలో తియ్యదనము మదిలో విషమూ ఉన్న మానవ రూప నర్పాన్ని ఎవరు నమ్ముతారు ?"

## 93. సంసార బీజం

పిల్లలు పెద్దల ననుకరిస్తారు.

తల్లి దండ్రులు వేకువనే లేచి ప్రభునామస్మరణ గావించితే పిల్లలు గూడా వారి జీవితములో, అదే సంస్కారము కలిగియుంటారు.

నీ సంతానము గూడా మంచి సంస్కారులుగా జీవితము గడపా అను కుంటే మీరు ఇప్పటి నుండే సత్కర్మలాచరించండి.

నీవు ఇంట్లో ఉన్నప్పుడు నిన్ను కలిసేవానికి ఎవరైనా వచ్చిన యడల ఇంట్లో ఉండి గూడా నాన్నగారు ఇంట్లో లేరని చెప్పమని చెప్ప వద్దు

అసత్యము చెప్పే అలవాటు పిల్లల జీవితాన్ని సర్వనాశనమ చేస్తుంది. అసత్య బీజారోపణ జరిగాక, పెద్ద వయస్సులో పెద్ద వృక్ష ముగా పెరిగి అది ఫలించిన తరువాత పశ్చాత్తాప పడినా ఫలితము శూన్యం.

-0-

"ఎవరి యందు నీవు అధికంగా ప్రేమాభిమానాలు చూపుతావో వారే నిన్ను చాలా బాగుగ ఏడిపిస్తారు "

## 94: దుఃఖమందే సుఖముంది:

ఏ దుఃఖమైతే నిన్ను ప్రభునామస్మరణ చేయించ కలిగిందో ఆ దుఃఖమే నిజమైన సుఖాన్ని కలిగిస్తుంది. ఏ సుఖమైతే నారాయణుని నామస్మరణ నుండి దూరము చేస్తుందో, ఆ సుఖం, సుఖము కాదు. పైది మిక్కిలి పెద్ద దుఃఖమనే చెప్పాలి.

దుఃఖమే మనకు గొప్ప సద్గురువు. అదే మన హృదయాల పరిపక్వము కలిగించు దివ్యమైన ఔషధము. జ్ఞానులు గూడు దుఃఖముచేత ప్రేరితులై ప్రపంచాన్ని వదిలినవారే !

"ప్రపంచము స్వార్ధముతో కూడినది. ఈశ్వరుడే నిజమైన ఆప్తుడు." అనే ఈ సత్యాన్ని మనము దుఃఖము నుండే తెలుసుకుంటాము.

"సుఖ్ మ శేషిలాపడె.
హరి హదయ్ సే జాయ్.
బలహరి హై దుఃఖ్ కీ
పల్ పల్ నామ్ జపాయ్."
అని అంటాడు ఒక జ్ఞాని

కనుక అటువంటి సంపద మనకు ఎప్పుడూ లభించదు. భగవత్ ప్రాప్తి కలిగాక పరమాత్ముని విస్మరిస్తే పెద్ద అనర్థం కలుగుతుంది. జీవితము వ్యర్థమైపోతుంది.

"శరీరోపాసనగాదు. చెయ్యవలసింది
ఆత్మోపాసన !"

## 95. మనస్సుకు తెలియపరచు

ఒకవేళ మనస్సు వ్యర్థముగా అటునిటు సంచరిస్తూ ఉంటే చీవాట్లు పెట్టు. అటువంటి మనస్సే చాలా పిరికిపంద, ఒకమారు దాన్ని భయ పెట్టి అదుపుచేసినచో పాపపుదారులు పయనించదు.

"విషయవాసనలచేత లీనమై నీవు పాపకృత్యాలు చేస్తూఉంటే— ఆ విషయవాసనలే నీకు శిక్ష విధిస్తాయని గట్టిగా మనస్సుకు తెలియ పరచు."

నీవే నీ మనస్సుకు తెలియపరచకుంటే మరి ఎవరు తెలియ చేస్తారు? తినేదానికి సిద్ధముగా పళ్ళెరమందుంచిన 'లడ్డు' పై ఉమ్మివేసి నచో, ఎంత ఆకలివేసినా అది తినేదానికి నీ మనస్సు అంగీకరిస్తుందా? చెప్పు చూస్తాము?

ఈ రీతిన నీవు మనస్సుకు తెలియచెప్పు. "తియ్యనై మధువలె నుండే విషయభోగాలు, కాలకూట విషముతో నిండి ఉంటాయని; ఎప్పుడు వాటికి దూరముగా సంచరించమని."

ఇది తెలుసుకుంటే మనస్సు పాపపుదారిలో ఎప్పుడూ పయనిం చదు.

"పాపము - ప్రేతము
ఈ రెండూ ఒకటే."

## 96. తీర్థయాత్ర

హృదయాన్ని భక్తిరసములో ముంచి తీర్థయాత్ర చెయాలి. వ్యసనాలతో ఇతరుల నిందించేదానికి కాదు, తీర్థస్థానాలకు వెళ్ళేది? తపస్సు. నిగ్రహముద్వారా పవిత్రమౌదామనే భావన మదిలో నుంచుకొని తీర్థస్థానాలకు వెళ్ళాలి.

పుణ్యానిదులకువెళ్ళి సొరకాయనో. లేక మరొక కూరగాయనో విసర్జించడములో ఏమీ ఔచిత్యములేదు. అక్కడ త్యాగము చెయ్యవల సింది, కామ, క్రోధ, మద-మాత్సర్యాలను!

భగవంతునకు ప్రీతికరమైన వస్తువను త్యాగముచేస్తే ఆయన ప్రేమకు మనము పాత్రులమౌతాము.

ఫలానా పుణ్యక్షేత్రమున కామాన్ని త్యజించాను, ఫలానా తీర్థములో క్రోధాన్ని వదిలేశాను. అని నీవు చెప్పగలిగితే నీ తీర్థయాత్ర ఫలప్రదమౌతుంది.

"తీర్థమున స్నానం చేశాక పాపాలు కడుగబడుతున్నాయి." అనే భావనతో జ్ఞానులను వెదకి వారితో సత్సంగము జరిపితే అప్పుడే మనస్సు బాగుపడుతుంది. జీవితము సార్థకమౌతుంది.

"ప్రభువు మనకు జీవితాన్ని ప్రసాదించాడు.
కనుక మనం జీవించ గలుగుచున్నాము.

## 97. మనోపాపాలు

మానవుడు తన శరీరముతో ఏమంత పెద్ద పాపాలను చెయ్య చములేదు. కాని మనస్సుతో చేస్తున్నాడు. తనువుద్వారా చెయ్యబడే పాపాలు, పట్టుబడుతాయనే భయముంది. కనుక మానవుడు పాపాలు చేసేదానికి భయపడిపోతాడు. ఐతే మనస్సు ద్వారా చెయ్యబడే పాప కృత్యాలు గుప్తముగా ఉంటాయి. కావున అవి దినదినానికి భయంకరముగా తయారౌతాయి చెదపురుగులాగా మానవుని జీవసత్వాలను హరింపచేస్తాయి.

మానసిక పాపాల ఎదుట చాలా జాగ్రత్తగా మెలగాలని భాగవతము మనల హెచ్చరిస్తుంది.

నీ మదిలోని పాపాలను నీవు గుర్తించగలవు. కనుక నీ మదిలోని పాపాలతో చాలా జాగ్రత్తగా ఉండు.

"ఉదయమే లేచి అద్దమందు నీవు ముఖాన్ని దర్శించినట్లు. ప్రతి దినము సత్సంగమనే సీసాలో, నీ మనస్సునుంచు ?

ఎవ్వరైతే మనస్సును కాపలాకాస్తారో— వారే జ్ఞానులౌతారు.

కనుక సర్వులు నేటినుండి జాగ్రత్తపడి మనస్సుచేత ఏలాంటి పాపకృత్యాలు చెయ్యకుండా జాగ్రత్త వహించండి.

"ధనాన్ని దుర్వినియోగ పరచడం—
లక్ష్మిని అవమానపరచడమే."

## 98. దృష్టి దోషం

సామాన్య మానవులయందును, జ్ఞానులయందును, దోషాలు ఎంచుతూ ఉంటారు కొందరు. ఇంకా కొందరు భగవంతునియందుకూడా దోషాలు వెదికేదానికి దృష్టిని సారించుతారు.

మానవుడు ఒకమారు దోషాలు వెదికేదానికి అలవాటుపడితే, అదే అలవాటు ఎల్లప్పుడూ అలవడుతుంది.

ఇతరుల బలహీనతను గమనించే అలవాటు నీవు పడ్డావా— ఇంక ప్రతివారిలోను నీవు ఏదో కొంత దోషము చూడగలవు.

ప్రతివారిలోను కొద్దిగానో, గొప్పగానో దోషాలుండడమే అందుకు కారణం. దోషరహితుడు ఈ మానవ శరీరముతో ఉండలేడు.

మదిలో కాలుష్యము లేకుంటే శరీరము సమాప్తమౌతుంది.

అందుకని ఓ సోదరా— ఇతరుల తప్పుల వెదకడము మానుకో? నీ దృష్టిని ఎల్లప్పుడూ మంచి గుణాలవైపు సారించు?

ఇతరుల గుణదోషాలు చూచే అలవాటు మన నేత్రాలకుండే— వాక్కును, మనస్సును, కలుషితము చేస్తాయి. పరుల పాపాలగూర్చి చర్చించడము, మన మనస్సును పాప కూపములో దింపడమేనని తెలుసుకో!

"అంతరంగమున ఈశ్వరుని వెదికేదాని బదులు
ఎవడు బైట వెదకుతాడో— వానికి దుర్దశ ప్రాప్తిస్తుంది."

## 99. ప్రభు - ప్రేమ

పరమాత్మని ప్రేమానురాగాలు లేనిదే జ్ఞానము శోభించదు. బ్రహ్మజ్ఞానికి గూడా పరబ్రహ్మ అనురాగం కావాలి.

ఎక్కడైతే కథ- కీర్తన జరుగుతుందో, అక్కడ గుప్తరూపములో 'హరి' ఉంటాడు. ఎందుకంటారా, ప్రభువుకు ఎప్పుడూ పరదా వెనుక ఉండడం ఇష్టము కనుక !

ఏ ప్రాణి తన ప్రేమను నూటికి నూరుపాళ్ళు ప్రభుమయం చేసి, పూర్తి విశ్వాసముతో మసలుతాడో, అట్టివారికి భగవానుడు, మాయారూపి పరదాను తొలగింప చేస్తాడు.

ఎవ్వనియొక్క నేత్రాలు పరమాత్మ దర్శనానికై కన్నీరు కార్చవో, వాని జ్ఞానం ఏమి చేసుకోను ?

ఎవ్వడైతే సత్కర్మ చేస్తూ హరినామ స్మరణ చెయ్యడో— ప్రభు ప్రేమకై ఎవ్వని హృదయము పగిలిపోదో, అట్టివాడు చేసే సత్కార్యము, ఎవరికోసం ? దేనికోసం ?

"సత్కార్యము చెయ్యటము ప్రభు కృపచేతనే సాధ్యపడుతుంది.

పరమాత్మని ప్రేమానురాగాలతో మన హృదయము ద్రవీభూత మైనవుడే శుద్ధిపడుతుంది. కాని జ్ఞానముచేత ఎంతమాత్రము కాదు.

కోమల హృదయమందు పరమాత్మ జ్ఞానము స్థిరముగా ఉం టుంది. ప్రభు ప్రేమతోనే, హృదయము కోమలమౌతుంది.

జ్ఞానం క్రియారూపములోనికి పరివర్తన జరగకపోతే
అది నిష్ప్రయోజనమే "

## 100. మనస్సును ఆరోగ్యముగా ఉంచుకో

శరీరము బాగుపడాలని మనము ఎంతో జాగ్రత్త తీసుకొంటున్నాము. అదే జాగ్రత్త మనస్సుపై నుంచడము లేదు.

శరీరానికి ఎవరెన్ని చెసినా ఏమిచేసినా చేసినవన్ని నశించేటివే. కాని మనస్సు నాశనమయ్యేది కాదు ! ఈ విషయము శ్రద్ధగా జ్ఞాపకముంచుకో ?

నేటి వర్తమాన సమాజములో ఎవ్వరు గూడా, వారి ఇంటి ఆచారాలను ధిక్కరించేడము లేదు. మీరు మిక్కిలి వస్త్రాలంకారముందు అధిక శ్రద్ధ చూపుచున్నారు, కాని మనస్సువైపు ఎవ్వరూ దృష్టిని సారించడమే లేదు.

మరణించిన తరువాత శరీరము నుండి వేరై నూతన క్షేత్రాన్ని ఆక్రమిస్తుంది 'మనస్సు'. అంతేగాని మరణించినా అది మారడములేదు. ఈ మనస్సు ఎప్పుడూ నిన్ను అంటిపెట్టుకొనే ఉంటుంది.

శరీరము చెడితే యేవి అతిగాన్ని బహుశా మార్పు చెయ్యవచ్చు. శస్త్ర చికిత్సద్వారా! కాని చెడిన మనస్సుకు ఎవ్వరూ చికిత్స చెయ్యలేరు.

నీవు మనస్సునైతే మార్పు చెయ్యలేవు, ఏ మనస్సు మరణించినా వెంట వస్తుందో అట్టి మనస్సు ఏన్నటికి చెడిపోదని తెలుసుకో !

నీ మనస్సే సాత్విక వృత్తిలో ఉండే జ్ఞాని ఔతావు.

మనస్సే చెడి గంగాతీతాన నివసించినా పాపాత్ముడ ఔతావు. జ్ఞాపకముంచుకో ?

"ఎవ్వనికి నిగ్రహ శక్తి ఉండదో ఎవ్వనికి ప్రభుభక్తి కొరకు నియమాలుండవో— వాని జీవితము వ్యర్థమే"

# 101. ప్రభాతేకర దర్శనం

"ప్రభాతేకర దర్శనం" దీని వెనుక మన సంస్కృతి యొక్క భవ్యభావన ఎంతో ఇమిడియుంది !

భారతీయ సంస్కృతి ఏమంటుందంటే— 'ఓ మానవా? బ్రాహ్మ ముహూర్త కాలమునలేచి భగవంతుని ధ్యానించు, తదనంతరం ని చేతుల దర్శించు." అని తెపుతుంది.

తరువాత ఈ భావనగూడా మదిలో నుంచుకో...

"ఈ హస్తములచేతనే దీనుల దుఃఖితుల యొక్క అశృభిందువుల తుడిచేస్తాను."

"ఈ చేతులతోనే పరమాత్మని పూజిస్తాను, అర్చన చేస్తాను.

"ఈ హస్తములతోనే చక్కగా కష్టపడి పనిచేసి కవలం (అన్నం) సంపాదిస్తాను."

"ఈ హస్తములతో ఎవరి అధికారములను కొల్లగొట్టను. ఈ హస్తములతో మరెవ్వరికి అపకారము తలపెట్టను.

ఈ చేతులతో, దొంగతనము, జూదము, మరి ఏ ఇతర పాప కృత్యాలు సలుపను."

"ఈ చేతులతో ఎవరినిగూడా మోసగించి పతనం చెయ్యను."— అని చెప్పుతుంది భారతీయ సంస్కృతి.

"ప్రభు ఏ సత్కర్మకొరకు చేతులనిచ్చాడో వాటిని సత్కార్యం కొరకు వినియోగిస్తాను. ఆ సర్వేశ్వరుని సహాయముతో భవసాగరమును గూడా దాటిపోగలను"— అనే ధీమా కలిగియుండాలి.

"ప్రభువును ప్రసన్నం గావించుకునే
లక్ష్యంతో పని చెయ్యి."

## 102. కాటుక బొట్టు

తల్లి తన తనయుడిని ఇంటినుండి బయటికి తీసుకవెళ్ళితే తన మనోభీష్ట ప్రకారము బాలుని అలంకరిస్తుంది.

అంతేకాదు, ఎవరిదృష్టి పడకుండా ఉండేందుకు నొసటిపైనగాని, బుగ్గపైగాని కాటుకబొట్టు పెట్టుతుంది- తన చిన్నారి పాపనికి.

ఇదేరీతిన భగవంతుడు కూడా తన ప్రియతమ భక్తుని అనేక సద్గుణాలచే అలంకరించి ప్రపంచ దృష్టి వానిపై పడకుండునట్లు, వాని వ్యక్తిత్వములో ఒకటో, అర్ధమో మచ్చ... నేర్పరుస్తాడు.

జ్ఞానుల కోపములో గూడా ప్రేమానురాగాలు దాగి ఉంటాయి. సాధారణ మనుజులవలె వారి కోపములో దోషాలుండవు.

అందుకని జ్ఞానులను ఎప్పుడూ దోష భావముతో చూడకు. తన భక్తులయందు అభిమానం పెరగకుండా, వాని మదిలో సర్వవేళలా దీనత్వం కలగాలనే తలంపుతో పరమాత్ముడు జ్ఞానులను దోషయుక్తుల గావించుతాడు.

"ప్రభువును సంతోషపరిచేందుకు చేసే ఏ కార్యమైనా ప్రభు భక్తియని అనిపించుకుంటుంది."

## 103. గోపిక

పరమాత్మను కలిసేదానికి అమితమైన ఆతురత ఎవ్వరి హృదయాంతరాళమున ఉత్పన్నమౌతుందో వారే గోపికలు అని అనబడుతారు.

గోపి భావనయొక్క పరాకాష్ట దశలో నామము, రూపము, పూర్ణ రూపముచే విరాజిల్లుతుంది. వారి మదిలో "నేను- నా దేవుడు" అనే భావన కలుగుతుంది.

ఇటువంటి దివ్యభావము యెప్పుడైతే జాగృతమౌతుందో— అప్పుడు అనేకులు 'ఆనంద సమాధి' ని అనుభవిస్తారు.

ప్రభువును కలవాలనుకునే తీవ్రమైన ఆతురతగల 'గోపి' యొక్క భావము బహుశా పూర్ణ రూపముతో జాగృతమై మెల్లమెల్లగా పరమాత్ముని అడుగులలో (దారిలో) ముందుకే వెళ్ళవచ్చు. సతతము ఏదో ఒక సాధనచేస్తూ, భక్తికలిగి ఉండవచ్చుగాక. మెల్లమెల్లగా నిగ్రహమూ భక్తి పెంచుకుంటూ పోతే— ఆ తరువాత నిన్ను కలిసేదానికి స్వతహాగా ఆ పరమేశ్వరుడు నీ వద్దకు పరుగెత్తి వస్తాడు.

యెవనికొరకు పరమాత్ముడే స్వయముగా పరుగులుతీసి వెతుకుతూ వస్తాడో వాడే భాగ్యశాలి, కాని భగవంతుని కొరకు పరుగులు తీసేవాడు కాదు.

"చెమటతో తడిసినపుడు మనకు లభించె ధనం
సద్గతికి రక్షగా నిలుస్తుంది."

## 104. పునాది

బాల్యావస్థయందు జీవిత నిర్మాణానికి ప్రారంభము జరుగుతుంది ఆ సమయములో సత్సంగము యొక్క అవసరము ఎంతో అవసరమౌ తుంది.

నిజమైన జ్ఞానుల దర్శన భాగ్యము మనకు దుర్లభమైనపుడు మరింక వారి సేవ-గూడా మనకు లభిస్తుందా ?

పేదలలో అత్యుత్తమ గుణం 'దైన్యం!

నిజమైన జ్ఞాని తన శిష్యులకు అధిక ప్రమాదాలను కలిగించే సంసార సుఖాలకు దూరం చేస్తాడు, శిష్యునిలోని వికారమును, భావన, ఇత్యాది అవగుణాలను నశింపచేసి పరమాత్మని భజించుటలో ఆనందింప చేయడమే నిజమైన జ్ఞాని యొక్క లక్ష్యం.

- 0 -

"సత్యాన్ని తెలుసుకున్న తరువాత ఆచరణలోనికి తేవడము జరుగుతుంది. అప్పుడే అది ఉపయోగపడుతుంది."

## 105. మృత్యు ముఖము

మానవ జీవితము పామునోట పడ్డ కప్పలాంటిది. దాని జీవితము మృత్యు ముఖములో పడినను- ఈగలను పట్టుకోవాలనే ఆతురతతో దాని నాలుక తహతహ లాడుతుంది.

యాభై యాభై ఐదు సంవత్సరాలు వయస్సు వచ్చినప్పుడు మానవునికి, తన ఆయుస్సు అర్థం కంటే ఎక్కువభాగం కాలుని నోటిలో కలిసిందనేది తెలుస్తుంది. అప్పుడు రక్షించుకొనుటకు ఏదారి కనిపించదు.

మునుముందునుంచే అతి జాగ్రత్తగా జీవితగమ్యాన్ని చక్క- దిద్దుకొనేదానికి ప్రయత్నం చేసియుంటే ఇప్పుడు పశ్చాత్తాపం పడవల సిన అవసరం ఉండదు కదా ?

ఎట్టకేలకు జీవితానికి అనివార్యమైన మృత్యువును ఆహ్వానించే దానికి ఇప్పటినుంచే సిద్ధంగా ఉండు.

దినదినము కొద్దికొద్దిగా మరణించే దానికి అభ్యాసముచేస్తే చివరికి శాంతముతో మరణించవచ్చు.

"ఎవరైతే పరమాత్మని కొరకు పరోపకారము కొరకు బాధలు సహిస్తారో వారు బాధపడవవసరము లేదు."

## 106. సర్వదోషాలను దర్శించుట

ముఖస్తుతి అంటే ఎవడు ఇష్టపడతాడో వాని హృదయములో అభిమానం పుట్టుకొస్తుంది. వాని కన్నులు మూసుకుపోతాయి. అంతేకాక తన దోషాలను తాను చూడలేని కారణంచేత ఏ మారినవాడౌతాడు. వాని జీవిత శకటము ఏ చోటైనా బోల్తాపడవచ్చు.

ఎవరిలోనైతే ఇతరుల గుణదోషాలను చూచే అలవాటుందో వాని మనస్సు చెడునడతలో మునిగియుంటుంది. అందుచేత వారి జీవితమున శాంతి నశిస్తుంది.

ఇతరులయొక్క గుణదోషాలనెంచడము చాలా భయంకరమైన కార్యం. కావున దోషాల చూడాలనుకుంటే నీలోనే అన్వేషించు. ఈ అలవాటు పెంచుకుంటూపోతే సావధానముగా నీవు పాపరహితుడ వగుదువు. నీలో సర్వవేళలా దైన్యం సద్భావమనెడి అమృతము వచ్చి గడ్డకట్టుకుందా. నీవు శాశ్వతముగా పరమాత్మని కృపకు పాత్రుడవగుదువు.

ఈ రీతిన ఎవడు తనలో గుణదోషాల నెంచుకోవాలనే అలవాటు, కౌతూహలము కలగాలనుకుంటాడో వాడు సతతము సత్సంగము చెయ్యాలి.

"ప్రవృత్తియొక్క విషయానందాన్ని వదలితే అప్పుడే
నివృత్తియొక్క నిత్యానందం ప్రాప్తిస్తుంది."

## 107. జరాసంధుడు - ద్వారక

జరాసంధుడు నిరంతరము దురాక్రమణ సాగిస్తూ ఉంటే శాంతి-సంరక్షణార్థం శ్రీకృష్ణుడు ద్వారకయందు నివసిస్తాడు.

జరాసందుడు అనగా 'జరా' వృద్ధావస్థ; ద్వారక అనగా "ద్వారే ద్వారేకం" ఇంద్రియాల కొరకు ప్రత్యేక-ద్వారము కదా శ్రీకృష్ణ పరమాత్మను ప్రకాశింపచేసే పేరే- ద్వారక !

జరాసందునితో యుద్ధము చెయ్యాలనే తలంపు శ్రీకృష్ణునికి లేకున్నా- ఎప్పుడు యుద్ధము చేస్తూనే ఉన్నాడు.

మనకు కోరిక ఉన్నా, లేకున్నా 'మధుర' రూపి శరీరములో ఎంతవరకు ఉంటామో, అంతవరకు 'జరా' వృద్ధావస్థ మనల ఆక్రమిస్తూనే ఉంటుంది.

అట్టిస్థితిలో జీవితానికి శాంతిని కలిగించే దానికి ప్రతియొక్క ఇంద్రియ ద్వారలకడ పరమాత్మని ప్రతిష్ఠింప (వెలిగింప) చేసి దేహాన్ని శక్తితో కూడిన 'ద్వారక' గా చెయ్యి ?

జీవితమంతా ఇచ్చిపుచ్చుకోవడాలతోనే కాలము గడుపుతూ ఉంటే వాని జవసత్వాలు వ్యర్థముగా నష్టమైపోతాయి. పైబడు మిక్కలి వృద్ధాప్యం వచ్చి చేరుతుంది. జీవితగమ్యం చెడిపోతుంది.

"పరమాత్మని ఇచ్ఛానుసారమే నీవు నడచుకో,
నీ భక్తి పారేనదితో సమానమౌతుంది."

## 108. ప్రేమ రసాయనము

అన్నిరకాల "నివృత్తులు" మనల గమ్యాన్ని చేర్చలేవు అదే మాదిరి అన్ని ప్రవృత్తులూ చెయ్యలేవు.

ఈ నివృత్తి - ప్రవృత్తిని కలిపే రసాయనమే 'ప్రేమ! ప్రతి కార్యము ప్రేమతోచేస్తే అలసట కనిపించదు.

పరమాత్మని సంతోషపరిచేందుకు, ఆయనను దర్శించడానికి పరోపకారముచేస్తూ ఇతరుల దుఃఖాలు దూరం చేసేదానికి ఏదో ఒక ప్రవృత్తి - నివృత్తి ఉండియే తీరాలి.

ఏ పనిచేస్తున్నా. పరమాత్మని తలచి ప్రేమ భావముతో చేస్తే పనియందు అలసట కనిపించదు. మనస్సు విసుగు చెందదు.

నీవుచేసే కార్యము ప్రజలు గొప్పగా భావించాలని కాక ప్రభు దృష్టిలో పడాలని చేస్తే ఎప్పుడూ నిరాశ ఎదురువదదు.

- o -

"ధనార్జనకొరకు ఏరీతిన చమట కార్చుతున్నావో-
అదేమాదిరి పరమాత్మని పొందేందుకుకూడా చెమటను కార్చు."

## 109. సమర్పణ యోగము

సమర్పణ యోగము నేర్చుకునేదానికి భాగవతము ఉంది. "సీది" అనేది ఏదో ఒకదాన్ని ప్రభుచరణార విందాలకు అర్పించు. తరువాత వివేకముతో దాన్ని ఉపయోగించుకోమంటుంది "భాగవతం"

ఈ శరీరాన్ని కృష్ణార్పణం చేస్తున్నామనే భావం, మెడలో తులసీ మాల ధరించక మునుపే కలగాలి. శ్రీకృష్ణుని సంతోష పరచేటందులకే ఈ శరీరాన్ని వినియోగిస్తానే భావము కలగాలి.

అట్టి సమర్పణ భావంగల భావనగల జీవి, భగవంతుడౌతాడు. కాలుని జయించగలుగుతాడు.

కాలుని భయం దేవతలకు గూడా ఉంది. కాని జీవుడు ఎప్పుడైతే సమర్పణ భావముతో సర్వేశ్వరుని ప్రీతికి పాత్రుడౌతాడో అప్పుడే కాలుని భయం దూరమౌతుంది.

"మనం పరమాత్ముని పిల్లలము, మనతండ్రి "సర్వశ్రేష్ఠుడు" అనే ఈ భావనతో భగవత్మయ జీవనమును గడుపువ్యక్తి నిర్భయముగా జీవించగలడు.

"సంవత్సరానికి ఒకటి రెండు నెలలు
తీర్థాటన చేస్తూ ప్రభువును సేవించు."

## 110. వాసనల ఆవరణ

ఏ రీతిన శరీరాన్ని వస్త్రం కప్పుతుందో సూర్యుని మేఘాలు అడ్డగిస్తాయో, అదేరీతిన వాసనల ఆవరణాన్ని పరమాత్ముడు అడ్డగిస్తాడు

జగత్తులో పరమాత్ముడులేని చోటు ఎక్కడుంది? సర్వత్రా ఆయన సామ్రాజ్యమే కదా? కాని వాసనలయొక్క ఆవరణం (నివాసం) ఎంత గట్టిదంటే ప్రభు దర్శనం కలుగుతుందా? లేదా? అనే సంశయం కలుగుతుంది.

"ఋషి, రూప" అనే గోపికలు ప్రభు దర్శనాన్ని కోరుకుంటారు. కాని వాసనలు నిండియుండుటచేత పరమాత్మ లభించదు.

అందుచేత ప్రభువు వాసనలనెడి ఆవరణాన్ని తొలగించి దివ్య రూపాన్ని సందర్శించే అవకాశము కలిగిస్తాడు.

ఈ రీతిన వాసనల నివాసాన్ని తొలగించి 'ఋషి' - 'రూప' గోపికలకు దివ్యరూప దర్శన ప్రధానముచేసే లీలలే పరమాత్ముని వస్త్రాపహరణ లీలలు.

"అన్నం పర బ్రహ్మ స్వరూపం-
దాన్ని పాడుచెయ్యకు."

## 111. అంతా పరమాత్మమయం

"జగత్ మిథ్య"- అని చెప్పుతూ వేదాంతులు మన మోహాన్ని తొల గించేదానికి ప్రయత్నిస్తూ ఉంటారు. 'జగత్తు బ్రహ్మమయం' అని వైష్ణవశాస్త్రం తెలుపుతూ ముక్తిని చూపుతుంది.

వైష్ణవాచార్యులు జగత్తును 'సత్యం' అని గుర్తించారు. ఆ కారణంచేతనే వారు జగత్తులో ఏముందో అదంతా భగవంతునిదేనంటారు. ఇట్లా చెప్పుతూ మనస్సులోని ఆసక్తిని వదిలేస్తారు.

వారి దృష్టిలో మానవుడు యజమాని కాదు, కేవలం సేవకుడు (దాసుడు).

యజమానికి చెందిన ధనాన్ని వినియోగించేటపుడు సేవకుడు వివేకముతో ఖర్చుచేస్తాడు. ఎందుకనగా తన యజమానికి ఖర్చు చూపాలి కదా."

నీ ఇంటిలో ఏముందో దానికంతా యజమాని పరమాత్మ దేనని నీవు ఆయనకు సేవకుడనని తెలచి వివేకముతో ఆ సంపదను వివేకముతో వినియోగిస్తావో అప్పుడు నీ జీవితము బంధనతో చిక్కుకోదు. నీ శక్తి నష్టపోదు.

"నీ ఇంటి అంగణమున నిలిచిన
భికారిగూడా పరమాత్మ స్వరూపమే.
అతనికి ఎంగిలి మెతుకులు వడ్డించకు!

## 112. ప్రేమ - మోహము

విరహముతో పిచ్చిగా మారిన గోపికలకు ప్రభు అభయమిస్తాడు. కలయికతో ఎంత ఆనందమున్నదో, విరహముతో అంత ఆనందముందంటాడు.

రాసలీలల్లో కామసుఖాలకు, మోహాలకు తావులేదు. అందులోనున్నది జీవాత్మ, పరమాత్మల విశుద్ధ ప్రేమ లీల.

ప్రేమ - మోహము, ఈ రెండు వేరు వేరు విషయ్యాలు. శరీరము రోగగ్రస్తమైతే మోహము పోతుంది. కాని ప్రేమ క్షణక్షణము పెరుగుతూ ఉంటుంది.

మోహంలో అత్యంత చంచలత్వం ఉంటుంది.
ప్రెమలో అత్యంత ధైర్యంగూడా ఉంటుంది.
చంచలత్వం ఉల్కాపాతాన్ని, ఝంఝూవాతాన్ని పుట్టిస్తుంది.
ధైర్యం నిర్మాణాన్ని ప్రతిష్ఠించుతుంది.

"భోజనం చేయునపుడు ఎంగిలిచేసినంత
పాపం మరేదీ లేదు."

## 113. మానాభిమానం

ఇతరుల నుండి ప్రశంస పొందాలనే తలంపు ఎప్పుడూ మదిలో నుంచుకోవద్దు. ఎందుకనగా స్వార్థముతో కూడిన ప్రశంస కనుక అందులో ఎంతమాత్రము నిజం ఉండదు. మీరు మిక్కిలి నేడు మనల పొగిడేవారే రేపు గేలి చెయ్యవచ్చు.

అందుకని నిజమైన ప్రశంస లేక పొగడ్త పొందాలనుకుంటే నీ మనస్సుతోనే పొందేదానికి నిశ్చయించుకో ? ఎందుకా నీ మనస్సే నిన్ను బాగుగా గుర్తిస్తుంది నీ మనస్సొసగే పొగడ్త నిజమైనది.

మనస్సుచేత ప్రదానము చేయబడిన ప్రశంశ, భగవంతుని ఆస్థాన మందుగూడా గౌరవాన్ని పెంపొందిస్తుంది. ఎందుచేతనగా మనస్సే సాక్షి భూతమైన ప్రశంశలో స్వార్థంలేదు కనుక. అందుకని ప్రశంశ పొందా లనుకుంటే మనస్సుతోనే పొందాలనే సంకల్పం కలిగియుండు.

నిజం చెప్పాలంటే మానావమానాలలో మన్సును శాంతపరచు కునేవాడే మహానుభావుడని అనిపించుకుంటాడు.

"లక్ష్మీదేవిని తల్లిగా భావించి సత్కార్యానికి వినియోగిస్తే
ఆమె సంతోషిస్తుంది.
భోగవిలాసాలకు దురుపయోగంచేస్తే
ఆమె కాలితో తన్నుతుంది."

## 114. ప్రభువు కొరకే ప్రభువు చెంతకు వెళ్ళు

పరమాత్ముడు ఎవ్వరికి దుఃఖాన్ని ఇవ్వడములేదు సుఖాన్ని కలిగించడములేదు. మానవుడాచరించే మంచి- చెడ్డ కర్మలే అతని సుఖ దుఃఖాలకు కారణం. కానీ చంచలమైన మనస్సు ప్రభువే ఈ సుఖ దుఃఖాలకు కారణమును కొంటుంది.

ఈ కారణంచేతనే మూర్ఖుడు దుఃఖము నుండి విముక్తిని పొంది, సుఖాన్ని పొందాలని ప్రభుచెంతకు వెళ్ళుతాడు. అట్టి స్వార్థ ప్రవృత్తిని చూచి ప్రభువాలా సిగ్గుపడుతాడు, అందుకని ప్రభుచెంతకు ప్రాప్తము కొరకు వెళ్ళకు, ప్రభువునే పొందేందుకు వెళ్ళు

ఎవ్వరి హృదయములో సుఖం కావాలనే అభిలాష నశిస్తుందో, వారే ప్రభువుకు ప్రేమపాత్రుడై పరమ సుఖాన్ని పొందుతాడు.

"ఎవరికైతే నిజమైన అధికారాలు లభిస్తాయో
వారిని ప్రభువే స్వయంగా తన చెంతకు పిలుచుకుంటాడు."

## 115. ఇంటిపై ఆసక్తి కూడదు

సద్భావముతో ఉచితమైన సేవచేస్తూ ఇంటిలోని వారిని సంతోష పెట్టు. అంతేకాని ఇంటిపై ఆసక్తి పెంచుకోకూడదు.

ఇంటిలో అన్ని కార్యక్రమాలు నిర్వహిస్తూ చిత్తాన్ని ప్రభు చర ణాలకు సమర్పించు.

ఆత్మ దృష్టితోటి మోహము ఎవ్వరిపైనా చూపకు.

ఆత్మ దృష్టిని ఉంచుతే ప్రేమ (దయ) పుట్టుకొస్తుంది. అదే ప్రభు సన్నిధికి (ని) చేర్చుటకు సహాయ పడుతుంది.

అట్లాకాక దేహదృష్టి నుంచుతే మాయా జాలములో చిక్కుకుంటే ప్రభువును చేరుకోవడము అసంభవమౌతుంది.

పతీ-పత్నుల సంబంధముకూడా పవిత్రమైనదే. అది భోగవిలాసా లకుకాక ఒకరికొకరు తమ ఉన్నతికై త్యాగముచేసే టందులకు ఆ బంధము !

"ధనముపై కోరిక కలగడము న్యాయబద్ధమే !"

## 116. పాపపు దారినుండి దృష్టి మరల్చు

అస్తి-ప్రాప్తి అనే ఇరువురి కుమార్తెల తండ్రియైన జరాసంధుని, కాలుడు (యముడు) నాశనము చేస్తాడు.

ఇచ్చి పుచ్చుకోవడమనే ప్రవృత్తిలో ఎల్లవేళలా మునిగితేలుతూ పాపకర్మలుచేసే మానవుడు ఇదే తమ జీవిత లక్ష్యమని ఎంతవరకు స్థిర పరచుకుంటాడో, అంతవరకు వృద్ధావస్థ వస్తూనే ఉంటుంది. కాలుని (యముని) క్రూరపాసమనే పంజా బాధిస్తూనే ఉంటుంది.

కాని సర్వేంద్రియాలను భక్తితోచూస్తూ తన దేహాన్ని 'ద్వారక' వలె దృఢపరచిన క్రిష్ణునిలాంటి మానవుని చెంతకు జరాసంధుడనె వృద్ధావస్థయొక్క శక్తియుక్తులు పనిచెయ్యవు.

ఎవ్వని మదితో బ్రహ్మవిద్య స్థిరముగా ఉంటుందో అట్టి యవ్వన రూపములోని కాలుని, యముడుగూడా ఏమీ చెయ్యలేడు.

అందుకని ప్రతి ఇంద్రియాన్ని పాపపుదారి నుండి ప్రక్కకు ఈడ్చి (లాగి) ప్రభుభక్తిలోనికి చొప్పించు.

"యవ్వనం అశాశ్వతం."

## 117. జీవన సప్తాహము

మనుజుడు మరణించిన తరువాత, వాని ఆత్మశాంతించాలని వాని ఆత్మీయులు భాగవత సప్తాహాన్ని పెట్టిస్తారు. మరికొందరు హరికథలు చెప్పిస్తారు.

వాని ఆత్మీయులు ఈ నిర్ణయం తీసుకోవడము మంచిదే. కాని చనిపోయిన వ్యక్తి పాపకృత్యాల్లో జీవితాన్ని గడిపియుంటే, ఈ భాగవత పారాయణాలు హరికథా కాలక్షేపాలు, నిష్ప్రయోజనమే.

వాస్తవానికి ఈ సప్తాహము జీవితములో ప్రతిదినమూ భాగవత పారాయణావశ్యకత ఉండదు.

అందుకని మన జీవితాన్ని భగవత్ మయమైపోవాలి. తద్వారా మరణించిన తరువాత భాగవత సప్తాహం, లేక హరికథా కాలక్షేపము ఏర్పాటు చేయవలసిన అవసరముండదు.

-0-

"మానవ మానాలయందు మనస్సు శాంతపరచుకోవడం అన్నిటికంటే పుణ్యకార్యం."

## 118. ఆశ్చర్యము

మనము రెండు మూడు దినాలు ఏదైనా బయటి గ్రామము వెళ్ళ వలసివస్తే దారిలో ఎదురయ్యే కష్టనష్టాలుగూర్చి యోచిస్తున్నాము.

కానీ మనము జీవితములో సర్వము వదలి ఒకానొక రోజు వెళ్ళిపో వలసివస్తుంది. మరి ఆ నిర్ణయించిన అంతిమ యాత్రనుగూర్చి ఎవ్వరూ యోచించరేమిటి? ఇదేమి విడ్డూరము !

అందుకని ఓ సోదరా ! రోజూ నీవుచేసే ఇతర కార్యకలాపాలతో పాటు కొద్దికొద్దిగా మరణించేదానికి అభ్యసించు.

జీవితమంతా ఇతర కార్యకలాపాలతో ఆర్జించి ప్రోగుచేసిన సంపద అంతిమ సమయములో ఏ పనికి ఉపయోగపడదని తెలుసుకో? ఆ సమయమున ఉపయోగపడేది మంచి కార్యకలాపాల ఫలితమే !!

ఇంత తెలిసియుండిగూడా జీవితములో నిరుపయోగపడే సంపద నార్జించేదానికే కాలాన్ని వ్యయము చేయడము జరుగుతుంది. కాని జీవిత చరమదశలో అవసరమయ్యే మంచి కార్యకలాపాలగురించి ఆలోచించడము లేదు.

ఎంత విడూరము !

"పరమాత్ముడు తన సన్నిధి చేరిన జీవిని
ప్రేమతో కౌగలించుకుంటాడు."

## 119. బత్తెము - జీవనము

కొందరి ఆర్థిక పరిస్థితి బాగున్నా, పదవీవిరమణానంతరము లభించే పెన్షన్ (భృతి) పెద్దమొత్తంలో లభించిననూ తృప్తిపడక వేరే నౌకరీ చేసేదానికి ప్రాకులాడుతూ ఉంటారు. ఇది అంత మంచి పద్ధతి కాదు.

జీవన భృతి పొందుతూ ప్రభు సేవయే చెయ్యాలి,

పెన్షన్ (భృతి) పొందుతూ ప్రభువును సంతోషపరిచే కార్యకలాపాలే చెయ్యాలి.

వృద్ధాప్యములో పెన్షన్ పొందుతూ ప్రతినిత్యము 21600 మార్లు ప్రభునామాన్ని జరిపించు. అట్లాచేస్తే నీ జీవితానికి శాంతి లభిస్తుంది. దానికి బదులు వేరే ఇతర నౌకరీ వెదకడము ఏమంత మంచిపని కాదు.

55 ఏండ్ల ప్రాయములో ఇంట్లో ఉండి కాలము గడిపేబదులు తీర్థస్థానమున నివాసముండడము మంచిది. ఇంట్లోనే ఉండవలసివస్తే చాలా జాగ్రత్తగా సాత్విక జీవితమును గడపాలి. యాభై అయిదు సంవత్సరాల ప్రాయమున నివృత్తిని వెదకాలి. అధిక పరోపకార పరాయణత్వముకూడా అంత మంచిది కాదు. అధిక ప్రవృత్తి అభిమానాన్ని పెంచి పరమాత్ముని మరిపింపచేస్తుంది.

"మానవుడు డబ్బుపూ స్తే పిచ్చి వాడవుతాడు.
అందుకే దానిచుట్టు తిరుగుచున్నాడు."

## 120. ఏకాంత సేవ చెయ్యి

జరాసంధుడు వెంటపడ్డప్పుడు శ్రీ కృష్ణుడు ప్రవర్షణ (పర్వతము) పైకి వెళ్ళేవాడు.

అందుచేత జరాసంధుడు ఆయనను ఏమీ చెయ్యజాలకపోయేవాడు.

జరాసంధుడనగా "వృద్ధావస్థ".

'ప్రవర్షనము'- అనగా అనుక్షణము భక్తిని పెంపొందించుకునే సాత్విక జీవనము.

వార్ధక్యము వెంటపడితే నీవుకూడా సాత్విక జీవితము కొరకు ప్రవర్షణ పర్వతము చేరుకో. దీనివలన వృద్ధావస్థ నిన్ను ఏమీ చెయ్యజాలదు.

వృద్ధాప్యము దరిచేరగనే నీవూ ఏకాంతవాసం చేస్తూ సాత్విక జీవితాన్ని గడుపుతూ భగవత్ భక్తి కలిగియుండు.

కుమారులకు వివాహము జరిగియుండి, కోడండ్రు వచ్చియుండినచో, ఇక నీ గృహస్థాశ్రమము పూర్తి అయింది కనుక, ఇంక భక్తితో భజనచేసేదానికి సమయమొచ్చిందని భావించు.

"దురుపయోగము చేస్తే ధనం విషమౌతుంది.
సదుపయోగము చేస్తే ధనం అమృతమౌతుంది."

## 121. మహాయోగి - మహాభోగి

శ్రీకృష్ణుని కధవింటే మహాయోగియైన శకునికి, మహాభోగియైన పరీక్షిత్ మహారాజుకు సమానమైన ఆనందము కలుగుతుంది. ఎందుకంటారా ? శ్రీ కృష్ణుడు మహాయోగీ, మహాభోగియైనందున.

సామాన్యముగా ఎవ్వరూ. యోగిగా, భోగిగా రెండూ కలిసి యుండలేరు.

యోగి భోగవిలాసాలతో కాలము గడుపుతే పతనమౌతాడు. భోగి యోగాభ్యాసముచేస్తే 'యోగి' గా తయ్యారౌతాడు. కానీ శ్రీకృష్ణుని చరిత్రలో యోగికి, భోగికి పెద్ద సమన్వయముంది.

పదహారువేల నూట ఎనిమిది రాణులచే కాపురంచేసే శ్రీక్రిష్ణుడు మహాభోగి పెద్ద పెద్ద యోగీశ్వరుల మధ్యన కూర్చున్న శ్రీక్రిష్ణుడు మహాయోగికూడా.

16108 మంది స్త్రీలకు స్వామియైన శ్రీక్రిష్ణుని చిత్తములో కామ వాసనలులేవు. పైదు మిక్కిలి ఆయన బ్రహ్మచారి కూడా.

అందుచేతనే శ్రీక్రిష్ణుడు సంసారులకు అటు సన్యాసులకు ఇరువురికి ఇష్టుడే !

"శక్తితోనే మృత్యువు ఉద్ధరింపబడుతుంది."

## 122. స్వభావాన్ని మార్చుకో

జీవి (ప్రాణి) స్వభావము సరియైనది కాదు. అందుచేతనే జీవి ప్రకృతికి దాసుడై తిరుగుతూ ఉంటాడు. ఎప్పుడు జానిసత్వం వస్తుందో అప్పుడు ఇబ్బంది కలుగుతుంది.

ప్రకృతికి దాసుడైన జీవి స్వతహాగా దుఃఖంతో చచ్చి బ్రతికి తిరుగుతూ ఉంటాడు. ఇతరులకూడా దుఃఖితుల చేస్తాడు.

పరమేశ్వరుడు ప్రకృతికి స్వామి (పురుషుడు).

ఆయనే ప్రకృతిని వశపరచుకోగలడు. అందుకే సుఖము - శాంతి ఆయన పాదసేవ చేస్తాయి.

అందుకని మొదట మనము తప్పక చెయ్యవలసిన కార్యము, జీవి యొక్క స్వభావాన్ని మార్చడం (బాగుచెయ్యడము)

ఈ స్వభావము తీర్థయాత్రలు, లేక యజ్ఞ యగాదులు సలుపుతే బాగుపడేదీ కాదు. స్వభావము జ్ఞానుల ప్రేరణాత్మకమైద వలుకులు ఆలకించి అమలునందుంచినపుడు బాగుపడుతుంది.

"భక్తిలేని యోగం వ్యర్థమే."

## 123. దేవుడు - పశువు - మానవుడు

పశువు అజ్ఞాని.

జన్మించిన మూడేండ్ల తరువాత అది తన తల్లినికూడా మరచి పోతుంది. అటువంటిది పరమాత్మని జ్ఞాపకం చేసుకొని జీవితాన్ని ఎట్లా సార్థకం చేసుకుంటుంది.

దేవతల జీవితము భోగ ప్రధానమైనది.

ఆర్జించిన పుణ్యఫలం కాస్తా భోగవిలాసాలకు వ్యయమైపోతే వానిస్థితి చాలా దయనీయముగా ఉంటుంది.

అట్టిస్థితిలో పరమాత్ముడు మనకు ఎట్లా లభిస్తాడు?

కాని మనుజునికి ప్రభువు జ్ఞానాన్ని ఇచ్చాడు. వాడు వివేకముతో భోగాలను అనుభవించగలడు. భక్తిమయ జీవితముతో భగవత్ ప్రాప్తిని కూడా పొందగలుగుచున్నాడు.

మనిషి దేహంలో కూర్చున్న జీవి. "నేనెవరిని?" అని ప్రశ్నించుకుంటే— "నేను పనికిరానివాడిని కాను, నేను చైతన్యవంతమైన పరమాత్మాంశాన్ని." అనే అనుభూతిని పొందగలుగుచున్నాడు.

మనము మానవదేహము పొందడమే మహాభాగ్యం.

"ఈశ్వరునిగూర్చి మాటలతో చెప్పే విషయం కాదు
ఈశ్వరునిగూర్చి జీవితములో అనుభవంలోనికి తెచ్చుకోవడం,
సాక్ష్యాత్కారం పొందవలసిన విషయం"

## 124. కథను విన్న తరువాత

జీవితములో మార్పు (విప్లవం) తెచ్చేదానికి కథ వినడము జరుగుతుంది.

కథను విన్న తరువాతగూడా జీవితములో నూతన చైతన్యం జాగృతం కాకున్ననూ నూతన జీవనం ప్రారంభం కాకున్ననూ. ఆ కథ కాదు.

కథ విన్న తరువాత నిశ్చయించుకోవాలి.
ఈ దినము నుండి క్రొత్త పాపాలు చెయ్యను.
ఈ దినము నుండి నేను ప్రభువుకు సేవకునిగా ఉంటాను.
ఈ దినము నుండి నాకు నూతన జన్మ ప్రారంభమౌతుంది.

ఈపై సంకల్పం జీవితంలో కలిగితే కథ వినడంద్వారా సార్థకమౌతుంది.

"జీవి ఈశ్వరునితో ఏలాంటి సంబంధం కలిగియుంటాడో
అలాంటి సంబంధమే ఈశ్వరుడు ఎల్లప్పుడు
తయారుచేసి ఉంచుతాడు."

## 125. భగవంతుడు - భక్తి

జీవుడు అధిక వినయముతో, విధేయతతో భావనాపూర్వక భక్తితో సేవిస్తే, భక్తవత్సలుడు- భగవానుడు భక్తునికి వశమౌతాడు.

పరమాత్మని పొందిన తరువాత చాలామటుకు జీవి ఏ మారి పోతాడు. అభిమానము పెరిగి ఉబ్బిపోతాడు హస్తగతమైన ఈశ్వరుణ్ణి జారవిడుచు కుంటాడు.

అందుకని ఈశ్వరుడు ప్రాప్తించిన తరువాతగూడా, భక్తితో సేవ చేస్తూనే ఉండాలి.

ఏ సాధన సంపత్తిచేత మనకు పరమాత్మ ప్రాప్తి కలిగిందో, ఆ సాధనను మరచిపోతే మనకంటే కృతఘ్నులు ఎవరుంటారు

మనము కృతఘ్నులుగా వ్యవహరించకూడదు ?

- 0 -

"ఎవ్వడు ఈశ్వరుణ్ణి తలుచుకుంటాడో
వాని జీవితము సఫలమౌతుంది."

## 126. జ్ఞానాన్ని జీవితముతో మేలవించు

భోజనం పేరు వినగానే తృప్తి కలుగదు. ఆకలి తీరదు ! భోజనం చేసినపుడే తృప్తి కలుగుతుంది.

ఈ రీతిన జ్ఞానాన్నిగూర్చి చర్చించుకుంటే, శాంతి కలుగదు. జ్ఞానం జీవితములో మిళితమైనపుడే శాంతి లభిస్తుంది.

జ్ఞానం జీవితమున మిళితము చెయ్యడమంటే ఏమిటి ?- ఈశ్వరుణ్ణి ఆత్మలో దర్శించడము.

జ్ఞానాన్ని జీవితములో జీర్ణించమంటే అర్థం— జగత్తులోని జీవులనంతాకూడా పరమాత్మ స్వరూపులేనని, భావించి స్నేహ భావముతో సేవ చెయ్యడము.

పరమేశ్వరునిగూర్చి మాటలతో చెప్పడము కాదు. జీవితములో ఈశ్వరుణ్ణి అనుభవములోనికి తేవడం, ఆత్మ సాక్షాత్కారము చేసుకోవడము.

- o

"సత్సంగడి లేకుంటే వివేకం జాగృతంకాదు.
స్వదోషాలుకూడా వెలువడవు."

## 127. కథ - మాత

కథ తల్లి వంటిది.

అది నూతన జన్మను ప్రసాదిస్తుంది.

అందుకని కథా శ్రవణం చేశాక పాత గుణదోషాలను నాశన మొనరించు

కథ విన్న తరువాత మదిలోని భావాలను మార్చుకో?

కథ విన్న తరువాత మునుపుచేసిన పాపకార్యాలగూర్చి పశ్చాత్తాప పడు ?

నా దగ్గరనున్న సంపద ప్రభువుదే— నేను ప్రభువు నౌకరును. అనే భావన కథా శ్రవణాంతరం మదిలో కలగాలి.

కథ విన్న తరువాతగూడా హృదయములో ఇట్టి నిర్మల భావం మదిలో కలుగకుంటే— వినిన కథ వ్యర్థమే మరి !!

-o-

"ఎంత ధనం నీ చేతులమీదుగా సత్కార్యాలకు వినియోగిస్తావో. ఆ వినియోగించిన ధనమే నీది."

## 128. ప్రభాతేకర దర్శనం

మన సంస్కృతిలో నిద్రలేవగనే "ప్రభాతేకర దర్శనం" ఆచారం ఉంది. కాని నేడు మనమందరం అట్లా చెయ్యడములేదు. "ప్రభాతే కప్పు దర్శనం" కావాలనే కోరికతో ఉన్నాము.

మనకు వెలుతురుతో ప్రాణదానము చేసేటటువంటి సూర్య భగవానుడు భూ ప్రదర్శన కొరకు వేకువనే ప్రారంభిస్తాడు. కాని మనం మంచంపై మసలుతూ ఉంటాము కాఫీ రడి లేవండి! మిమ్మల్నే, వినిపించడంలేదా? అని పిలుపు వచ్చినంతవరకు కండ్లు తెరవడము లేదు.

ఈ 'కప్పు దర్శనం' తో మనోవికృతి కారణంచేత మనము పతనమై అఖాతంలో పడిపోతున్నాం.

మనము 'కాఫీ'కి బానిసలయ్యేందుకు పుట్టినామా?

కాదు. కానే కాదు. మనం ప్రభుచేత ఇవ్వబడిన రెండు హస్తాల చేత ప్రభువును సంతోషపరచేందుకు సత్కార్యాచరణ గావించేదానికే పుట్టినాము.

జ్ఞాపకముంచుకోండి.

"డబ్బు సంపాదించడము తేలిక. కాని
దాన్ని సదుపయోగించడం కష్టం."

## 129. 'పాపము' ఒక బంగారు పాము

"పాపము" ను గూర్చి చాలా జాగ్రత్త పడాలి. పాపము సుకుమారమైన పాము మాదిరి మన కన్నులు, నాలుక, మనస్సు, మొదలైన ఇంద్రియాలపై అధికారాన్ని చెలాయించి ముందుకు తీసుకెళ్ళుతుందని మనకే తెలియదు.

ఈ పాపము నుండి రక్షింపబడేదానికి మనం, మన మనస్సును, నాలుక, కన్నులను అదుపులో నుంచుకోవాలి. తెలియక ఏదైనా పాప కార్యము చేస్తే పదిమందికి తెలియచేసి, పాపప్రక్షాళనం గావించుకో?

దాచి పెట్టుకున్న పాపాలకు శిక్ష చాలా భయంకరముగా ఉంటుందని జ్ఞాపకముంచుకో? చక్రవడ్డీ మాదిరి, దాని భారము పెరుగుతూ పోతుంది. మరణానంతరము దారుణమైన దుఃఖం అనుభవించవలసి వస్తుంది.

- o -

"కొద్దిపాటి ధనాన్ని భోగవిలాసాలకు ఖర్చుచేసి
మిగిలిన ధనాన్ని ప్రభుసేవకు వినియోగిస్తే లక్ష్మి సంతసిస్తుంది."

## 130. భోగభూమి - కర్మభూమి

స్వర్గం భోగ భూమి.
మర్త్యం కర్మభూమి.

స్వర్గంలో దేవతల జీవనము ముఖ్యముగా భోగ ప్రధానమైనది కావడముచేత నూతనముగా పుణ్యకార్యాలు చేసేదానికి అవకాశము లేదు. కాని భూమిపై సదాచార జీవనాన్ని గడిపి పుణ్యాన్ని పొందడము జరుగుతూ ఉంది.

"స్వర్గం" సుఖాన్ని అనుభవించే స్థానం— కనుక మనం చేసిన పుణ్యము కాస్తా వ్యయమౌతుంది. చివరకు దుఃఖాన్ని ఆపాదిస్తుంది.

భూమిపైన అపారమైన వేదనల సహించిగూడా నూతన సత్కర్మలు చేసేదానికి అనుకూలముండుటచేత, స్వర్గంలోని దేవతలుగూడా మన భరతభూమిలో జన్మించి పుణ్యాన్ని పొందేదానికి కోరికను వ్యక్తపరుస్తారు.

ఎందుకనగా స్వర్గములోని దేవతలు బాగుగా భోగవిలాసాలు అనుభవించగలరు. కాని శాంతిని పొందలేరు. ఎందుచేతనంటారా, అక్కడ క్రొత్తగా మరే సాధన చేసేదానికి అవకాశముండదు, కేవలము సంపాదించిన పుణ్యం ఖర్చు చెయ్యడమే జరుగుతుంది కనుక.

"లక్ష్మీదేవిని తల్లిగా భావించి ఆమెను సత్కార్యాలకు
వినియోగిస్తే ఆమె సంతోషిస్తుంది.
అట్లాకాక ఉపయోగించాలనే ధ్యేయంతో
దురుపయోగం చేస్తే ఆమె కాలరాస్తుంది."

## 131. ఈశ్వరుని ఉనికి

మానవుడు పరమాత్మ స్వరూపుడు.
అజ్ఞానముతో 'జీవభావం' తో ఉన్నవాడు మానవుడు
అజ్ఞాన రహితమైన చైతన్యమే ఈశ్వరుడు.
అజ్ఞానముచే ఆవరింపబడినవాడు జీవుడు.

జ్ఞానియైన మహా పురుషుడు ఈ రెండు తత్వాలను బేధమని తలంచడు.

వడ్లు-బియ్యం, రెండు ఒకటే— కాని వడ్లతో అన్నం వండ లేము. దానిపై పొట్టుతీసిన తరువాత అన్నము వండడము జరుగుతుంది.

ఈ రీతిన చైతన్యానికి ఆవరించిన అజ్ఞానాన్ని దూరము చేసి నపుడే ఈశ్వర తత్వము అనుభవములోనికి వస్తుంది.

ధ్యానము అనగా ఇక్కడ అజ్ఞానం ఆవరించిన చైతన్యం. ధ్యాన మనగా జీవుడు బియ్యమనగా అజ్ఞానరహితమైన చైతన్యం. అదే ఈశ్వరుడు.

అజ్ఞానాన్ని తొలగించినపుడు అందరిలోనుండే పరమాత్మ దర్శన భాగ్యం కలుగుతుంది.

"జీవుడు ప్రకృతికి దాసుడై తిరుగుచున్నాడు.
అందుకే దుఃఖపడుచున్నాడు.

## 132. మందిరంకు వెళ్ళిన తరువాత..

మందిరములోని ప్రభు సన్నిధికి వెళ్ళు. అప్పుడు నీవు పరమాత్ముని భావపూర్ణ నయనాలతో చూడు. "నా ప్రభు నన్ను చూస్తున్నాడు. నన్ను చూస్తూనే ప్రభువు కన్నులు ప్రేమతో హర్షితమౌతాయి." అనే భావనతో దేవాలయానికి దర్శించేదానికి వెళ్ళితే నీకు శాంతి లభిస్తుంది.

ఎవ్వని హృదయమైతే భావనతో నిండి ప్రభు చరణాలచెంత ద్రవీభూతమౌతుందో, వానికి శాంతి, ఆనందం ప్రాప్తిస్తుంది.

మందిరము వెళ్ళి (దేవాలయం) ఏ భావనతో భగవంతుని దర్శిస్తున్నావో- అదే భావనతో ప్రతి ప్రాణిలోను ప్రభువుని దర్శించేదానికి మనసులో భావన కలగాలి,

ఈశ్వరుడు దేవాలయమున ఒక సింహముపై కూర్చుండే తత్వమేనా? ఆయన ప్రతి ప్రాణిలోను జ్యోతిర్మయముగా వెలుగొందే చైతన్యం మనకు ఎక్కడనుండి వస్తుంది?

ప్రతి వారిలోను విరాజిల్లే పరమాత్మ ప్రతియొక్కరి మనస్సుకు, బుద్ధి, మరియు పంచేంద్రియాలకు శక్తిని కలిగిస్తున్నాడు.

ఆ పరమాత్ముడినే ధ్యానిస్తూ ఆయననే స్మరిస్తూ అహర్నిశలు ఆయననే దర్శించు.

"శివుడు ప్రకృతికి 'పతి' అందుకే ఆయన దానిని
వశపరచుకున్నాడు."

## 133. దుఃఖ హృదయము

మనం చాలా ప్రేమాభిమానాలతో కలుసుకొన్నప్పటికిని, మన ఎదుటి వ్యక్తి నిర్లక్ష్యభావం చూపితే మనం చాలా బాధపడటము జరుగుతుంది. "తనను తాను నశింపచేసుకొని మన బ్రతుకుతెరువు కోసం ఆహారాన్ని బహూకరించే భూమాత హృదయముగూడా నేడు అదేరీతిన దుఃఖిస్తూ ఉంది.

భూమాత బహూకరించిన కానుకను ప్రేమతో కళ్ళకద్దుకొని ఆకలిగొన్న అనాధ జీవులకు పట్టెడు పెట్టెబదులు దుర్వినియోగం చేస్తున్నారు నేడు చాలామంది. సకల పదార్థాలు వడ్డించిన విస్తరిని కాస్తో, కూస్తో ఎంగిలిచేసి పారవేస్తున్నారు కొందరు. మరికొందరు భూపుత్రులు ఆకలి దప్పులతో అలమటిస్తూ పిడికెడు అన్నం పెట్టేదాత కనిపించక ఇక్కడా అక్కడా భిక్షాటన చేస్తూ ఉంటే. కొందరు ధగాకోరుగా వ్యవహరిస్తూ ఉంటే. భూమాతకు బాధ కలుగదా ?

మనం ఒక్క పిడికెడు మెతుకులు దానము చెయ్యకున్ననూ- మన అవగుణాలను క్షమించి దుఃఖాన్ని దిగమ్రింగి మనకు ఆహారాన్ని అందిస్తూ ఉంది భూమాత.

భూమాత హృదయం ద్రవీభవించేటట్లు, ఆమె మనస్సు మునుపటిలాగా ఉత్సాహంగా ఉండేటట్లు చేసేదానికి ఆహారాన్ని గౌరవించి విసరి పారవేయకుండా చూడాలి. ఆకలిగొన్న సోదరులకు ఉత్సాహ పూర్వకంగా అన్నదానం సలుపుదామనే సంకల్పం మనలో కలిగియుండాలి.

"ఎవని స్వభావము బాగుపడుతుందో
వాని సంసారమూ బాగుంటుంది."

## 134. దుఃఖమెందుకు ?

స్వయముగా తమ హృదయాంతరాలలో ఆనందకందుడైన పరమాత్మను అత్యంత చేరువలో సతతము అనుభవించే భక్తులయొక్క హృదయం ఎల్లప్పుడూ సద్భావనతో సంపూర్తిగా నిండియుంటుంది.

అటువంటి జ్ఞాన పురుషులు నిద్రావస్థలో కూడా నారాయణుని దర్శించుతూ, శత్రువులకూడా దయానిధిని చూచినట్లు చూస్తారు.

అందుచేత వారి హృదయములో ఎన్వరియందును ఈర్ష్యా-ద్వేషాలు గాని, శత్రుత్వంగాని ఉండదు.

కాసంత ధనం లభించగనే కొందరు ఆనంద పారవశ్యముతో నాట్యం చేస్తారు. ఎగిరిగంతులు వేస్తారు. మరి ఆ మహాపురుషులు సాక్షాత్తు లక్ష్మీనారాయణుని పొందుతున్నారు కదా ? మరి వారికెందుకు దుఃఖం కలుగుతుంది ?

- 0 -

"వినయముతో కూడిన నామస్మరణ
స్వభావము మార్చుతుంది."

## 135. శ్రార్ధము - పిండదానము

"శ్రార్థము కొరకు చేసే సత్కర్మకంటే పరోపకారముకొరకు పరమాత్మ ప్రీత్యర్థము చెయ్యడమే నిజమైన శ్రార్థకర్మ,"అని అనిపించు కుంటుంది.

పరమాత్ముడు ప్రదానము చేసిన ఈ మానవ దేహము కొరకు వదిలే పిండదానముకంటే ప్రభు ప్రీత్యర్థం, సేవాకార్యము చెయ్యడమే నిజమైన పిండదానం.

ఈ ప్రకారముగా అధిక శ్రద్ధతోచేసే ఈ శ్రార్థకార్యము, పిండ దానము స్వయముగా పుత్రుడు చేస్తాడనే ఆశ వదులుకో.

ప్రేమలేకుండా పుత్రులుచేసే ఈ శ్రార్ధకార్యాలచే చనిపోయిన తండ్రియొక్క జన్మ మృత్యువుని విముక్తి కలుగదు. ఇది నిజమైన మాట.

"జ్ఞానాన్ని గూర్చి మాట్లాడడం కాదు.
దాన్ని వినియోగించుకున్నప్పుడే
జీవితం సఫలమౌతుంది."

## 136. ప్రేమ సంయోగం

జ్ఞాని కేవలం మందిరములోనేకాదు, ప్రతి ప్రాణిలోను దైవాన్ని దర్శిస్తాడు.

వారు జడపదార్థాలతోగూడా పరమాత్మని కనుగొన గలరు.

పుష్పములందు పరమాత్ముడు విరాజిల్లు చున్నందుననే అవి సుగంధాన్ని వెదజల్లుచున్నవి.

ఆ కారణంచేతనే పువ్వుల చూడగానే ప్రభు చరణారవిందాలకు అర్పించేదానికి ఆతురత పడతారు.

జ్ఞాని ప్రతియొక్కరితోను ప్రభువును దర్శిస్తూ స్వయంగా పరమాత్మను దర్శించిన అనుభూతి పొందుతాడు. వైకుంఠములో వెలుగొందే పరమాత్మ జడా-జడపదార్థాలలోనూ, తనలోను వెలుగొందుచున్నాడని భావిస్తాడు.

ఈ ప్రకారము ప్రభుతోటి సంపర్కము అపారమైన శక్తిని, శాశ్వత ఆనందాన్ని ఆస్వాదిస్తాడు జ్ఞాని !

"మనసు ఉదారముగా వ్యవహరిస్తే
కుటుంబంలోనూ- జీవితములోనూ
శాంతిస్థాపన జరుగుతుంది."

## 137 జడసమాధి

మనస్సును బలవంతముగా పట్టి బంధించి బ్రహ్మరంధ్రంలోనికి తెచ్చి తేజోమయమైన బ్రహ్మతో నిలపడము 'జడసమాధి' అని అంటారు.

అట్టి సమాధి స్థితిలో కూర్చున్నవానిని కాలుడుగూడా స్పర్శించ జాలడు. ఈ మాట నిజం. కాని బలవంతముగా వశములో నుంచుకున్న మనస్సు కోపముతో నిండిపోతుంది. అవసరమొచ్చినపుడు అది మనల అఖాతములోనికి త్రోసివేస్తుంది.

పరాశరముని అరవేల సంవత్సరాల వరకు జడసమాధిలో కూర్చొని మనస్సును కట్టుడిట్టాలతో నుంచడము జరిగింది. కాని అట్టి మనస్సుగూడా కాస్తా అవకాశము లభించగనే గంగానదిలో నావనునడిపే సాధారణమైన మత్స్యకన్నె, పరాశరమునీశ్వరుని దోచుకొంటుంది.

మనస్సును జడసమాధిలో బంధించినప్పటికి మదిలో కామవాస నలు ఉండకూడదు. ఈ కారణముచేతనే వేల సంవత్సరాలు జడసమాధిలో ఉన్ననూ పతనావస్థకి దాటిటీసింది.

"ఇంటిపై అనాసక్తి నుంచి
బంధుమిత్రులకు సేవచెయ్యి."

## 138. విప్పారిన నేత్రాలతోనే బ్రహ్మచింతన

మనస్సును పవిత్రముగా ఉంచుకునేదానికే కన్నులు మూసుకోవల సివస్తుంది. "ఎవ్వని మనస్సు నయనాలు మూసుకున్నప్పుడు పవిత్రముగా ఉంటుందో, వాని మనస్సు నేత్రాలు తెరవగానే తర్పదారి పట్టుతుంది. (అపవిత్రమౌతుంది)

ప్రభుప్రేమతో పరకాష్టనందుకొన్న గోపికలు విప్పారిన నేత్రాలతో బ్రహ్మచింతనతో లీనమౌతారు. ప్రభువుచు దర్శించగలుగుతారు.

వికసించిన నయనాలతో ప్రపంచాన్ని చూచేవాడు, బ్రహ్మచింతన సమయములో నేత్రాల మూసుకొంటున్నాడు.

కాని గోపిక విప్పారిన నేత్రాలతో భగవంతుని చూస్తూ ఉంటుంది. అందుకే ఆమె ఉద్ధవునితో అంటుంది — "ఉద్ధవా, నీ పరమాత్ముడు సద్గుణరూపియా, లేక నిర్గుణ రూపియా ? అనేది నాకనవసరము. కృష్ణ కృష్ణాయని నేను అనగానే నా కృష్ణుడు నిలుస్తాడు. ద్వారకలో ఉన్నా
"అది ఎంతటి ప్రేమ పరాకాష్ట."

- o -

"పతీపత్నుల పవిత్రబంధం
భోగవిలాసాలకు కాదు— త్యాగానికి."

## 139. వందనం

దేవాలయమువెళ్ళి ప్రభుసన్నిధిని నిలుచు. ప్రభుచేసిన ఉపకారాలను స్మరించుకో— హృదయాన్ని భక్తి భావనతో నింపు. బాధాపూరితమైన హృదయముతో పరమాత్మునికి వందనమాచరించు.

వందనములో హృదయములోని భావాలు సమ్మిళితమైతే అది సార్థక వందనమౌతుంది.

వందనము— చేతులతోను, లేక తలతోను కాదు చెయ్యవలసింది. హృదయముతో చెయ్యాలి.

ప్రభు చరణాల కడ వినయముతో వందనమాచరిస్తే పరమాత్మ బాలా సంతోషిస్తాడు. తద్వారా జీవికి ఎంతో లాభము కలుగుతుంది.

అందుచేత క్షణక్షణం వందన మాచరించు.

ప్రభు— పదార్థాల చేతగాదు, ప్రణామములతో ప్రసన్నమౌతాడు.

పదార్థాలచే ఎవ్వరు సంతోషిస్తాడో వాడు పరమాత్మ కాదు జీవాత్మ.

ప్రణామములచే ఎవ్వరైతే ప్రసన్నమౌతాడో వాడే పరమాత్మ!

"కాలమును నాశనము చెయ్యటం
సర్వమూ నాశనము చెయ్యటమే."

## 140. వేదాంతము - భాగవతము

వేదాలలోను, ఉపనిషత్తులయందును పరమాత్మను వర్ణించునపుడు 'నేతి-నేతి" అనే నిషేధక పదాలను వినియోగిస్తారు. కాని భాగవతము మొదలైన వైష్ణవ శాస్త్రాలలో "ఓ పరమాత్మా ఎక్కడున్నావయ్యా" అనే విధేయతతో వ్యవహరిస్తారు.

ఎవ్వరైతే వివేకము.వైరాగ్యము. షట్చక్రాల సంపత్తి. మోక్షము కొరకు ఆసక్తి మొదలగు సాధన చతుష్టయముతో సంపన్నుడౌతాడో వాడే వేదాంతాన్ని తెలుసుకో గలుగుతాడు.

కలియుగమందు మానవ సమాజము విలాస జీవితానికి అలవాటు పడింది. కాని వేదాంత తత్వ జ్ఞానము సమాజానికి రుచించదములేదు ఇది తెలిసిన వేదవ్యాసుడు భాగవతాన్ని రచించడము జరిగింది.

వేదాంతము విరక్తునికే— కాని ఉదయము, లేక సాయింత్రము సకాలానికి కాఫీ అందకపోతే తలనొప్పి వస్తే, ఇంక వాడు 'వేదాంతి' యని ఎట్లా అనుకోవాలా ?

మన హితముకోరి చక్కగా యోచించి, వ్యాసులవారు భాగవత మనే దర్శన శాస్త్రాన్ని మనముందుంచారు.

జ్ఞానులు, యోగులు ఏ ఆనందాన్ని ధ్యానంద్వారా పొందుతారో- అదే ఆనందాన్ని గృహస్థులు ఇంటిలో పొందేటందుకు వ్యాసమహర్షి దృష్టిలో నుంచుకొని చాలా శ్రమచేసి భాగవత శాస్త్రాన్ని రూపొందించారు.

"ఆత్మ దృష్టితో ప్రేమ ఉత్పన్నమౌతుంది.
శరీర దృష్టితో జాగృతమౌతుంది."

## 141. దోచిన ఖజాన

నేడు జీవితము అర్థప్రధానము, కామ ప్రధానమూ అయి పోయింది. డబ్బు ప్రధానమైపోయింది నేడు. పరమాత్ముడు పనికిరాని వాడైనాడు.

మొదట ఏ ఆనందమైతే రొట్టె- ఆకుకూరలో లభ్యమౌతూ ఉండిందో ఆ ఆనందము నేడు కారు- బంగ్లాలోకూడా లభించడములేదు.

కారణమేమనగా సుఖసౌఖ్యాలకొరకు ఏర్పడే సాధనలు పెరిగే కొలది మానవుని అంతస్థలములో వాసనలనెడి- అగ్ని ఉత్తేజితమౌతూ ఉంది. మానవుని ఆంతరంగిక ఖజానా (ధనాగారము) దోచుకోవడము జరుగుతుంది.

వ్యాసమహర్షి విశాల దృక్పథముతో దీర్ఘదృష్టితో కలియుగ జీవులకు ఈ దశను కల్పించినాడు. కలియుగములో పైసలవెనుక పరుగులు తీసే మానవుల, పరమాత్ముని వెంట పరుగెత్తించే ప్రవృత్తిని కలిగించే దానికి, ఇంట్లో కూర్చొని సాధనచేస్తూ ఆనందానుభవము పొందాలనే దృక్పథము కలవారికే భాగవతాన్ని రచించాడు.

"విలాసవంతులకు భగవంతుడుగూడా
దూరముగా పారిపోతాడు."

## 142. బ్రహ్మ సంబంధము

నీ మనస్సు ఎక్కడ కూర్చుంటుందో నీవూ అక్కడే కూర్చో !

మనస్సు విషయ వాసనలతో నిమగ్నమైనపుడు వెయ్యిమార్లు స్నానముచేసినా నీకు ప్రభుతోటి ప్రేమ సంబంధము లేనంతవరకు అపవిత్రుడవే నీవు.

మనస్సు ప్రభు చరణాలయందు నిమగ్నమై, శరీరము ప్రతిక్షణము పరమ పవిత్రముగా ఉండి, ప్రభుతోటి ప్రేమ సంబంధము దృఢపడేదానికి పరమాత్ముని ఎదుట పరుగులు తియ్యి.

మనస్సుచేత సంసార వాసనలు కలిసినా, బ్రహ్మ సంబంధము స్థాపింపబడుతుంది

బ్రహ్మ సంబంధము శరీరానికి కాదు, మనస్సుకు.

మలమూత్రాలతో నిండియున్న శరీరాన్ని ప్రభు స్పర్శించడు. ఎప్పుడైతే శ్రీకృష్ణుని నామస్మరణతో దేహంయొక్క భ్రాంతి సమాప్తమౌతుందో, ప్రపంచము విలీనమైపోతుందో, అప్పుడే మనస్సు ప్రభుయందు తన్మయమౌతుంది. అప్పుడు వారితో ప్రభు ప్రేమ సంబంధాలు ఏర్పరచుకుంటాడు.

అన్నిటికంటే అధిక మహత్తు మనస్సు తన్మయత్వం చెందడము. కనుక మన మందరము, మన చిత్తాలను పరమాత్మ సన్నిధికి సమర్పించి ప్రభు సంపర్కాన్ని వెదకుతూ పరమాత్మునివైపు పరుగులు తీయిద్దాం !

"కుటుంబమంతా కలసి ఒకచోట కూర్చొని ప్రార్థించినపుడే గృహస్థాశ్రమానికి ఆనందం."

## 143. మృత్యువు - మంగళము

మృత్యువును నివారించడము అసంభవమని మహాపురుషులు తెలుసుకొని సత్ప్రవర్తనద్వారా మరణ దోషాన్ని చక్కపరచుకోవడము జరుగుతూ ఉంది.

మానవుడు వైరములతోను, ద్వేషముతోను, చనిపోతూ ఉన్నాడు. అందుచేత మృత్యువు చెడిపోతుంది.

మనమొకదినం అన్నం మానుకుంటే మనస్సు అన్నంపైకి పదే-పదే పరుగులు తీస్తుంది. మృత్యుశయ్యపై పడినవాడు ఎన్నిదినాల నుండియో అన్నం మానుకోవడమతో వాని మనస్సు అన్నంపైకి మళ్ళుతుంది. కనుకనే అన్నవాసన మిళితమైన ప్రాణి మరణించిన తరువాత వాని ఆత్మ శాంతికి అన్నదానముచేసే ఆచారము ఉంది.

కాని ఏ వాసనలతోను సంబంధము లేకుండా చనిపోయిన వ్యక్తికి శ్రార్ధకర్మలు చెయ్యకున్నా ఏమీ ప్రమాదము లేదు.

అందుచేత ఈర్ష్యా ద్వేషాలను త్యజించి భక్తిమయ జీవనాన్ని గడిపే మృత్యువు శుభకరమైన పండుగగా మారుతుంది.

"జీవితములో మార్పు తెచ్చుకునే దానికొరకే
కథాశ్రవణం చెయ్యాలి."

## 144. చైతన్య సమాధి

మనస్సును ప్రేమతో బుజ్జగించి ప్రభు మార్గములోనికి తెచ్చేదానికి పరమాత్మ స్వరూపముతో లీనమై విప్పారిన నేత్రాలతో, ప్రభువును దర్శించి ఉన్నతస్థానము పొందేదానికిచేసే కార్యాన్నే చైతన్య సమాధి అని అనబడుతుంది.

ప్రభు మార్గములో మనస్సు పయనించితే నీకు నీవే ఉద్ధరించబడి సహజ సమాధియొక్క అనుభవాన్ని పొందుతావు.

అటువంటి సత్పురుషులయొక్క మనస్సు, విప్పారిన నేత్రాల ఎదుట కామోత్తేజమైన దృశ్యాల చూచినా పవిత్రముగానే ఉంటుంది. కారణం ఏమనగా వారియొక్క మనస్సు పరమాత్మునిపై లీనమై యుంటుంది.

"ఇదే నిజమైన సమాధి"

ఇట్టి దశను అనుభవిస్తూ శుకదేవుడు (శుక మహర్షి) గంగలో నగ్నంగా స్నానముచేస్తూ యువతులనేకుల ఎదుట నగ్నముగా తిరుగు తాడు. అయిననూ ఆయన మనస్సు విచలితము కాదు. కారణమేమనగా ఆయన తన మనస్సును ప్రేమతో పరమాత్మవైపు మళ్ళించి యుండడమే!

"అభిమానాన్ని- ప్రేమను ఇతరులకు ఇచ్చివేస్తే
మనస్సు శాంతిస్తుంది."

## 145. ప్రేమ - తన్మయత్వం

నీ మనస్సును ప్రేమతో బుజ్జగించి ఉన్నతమైన భూమిక (స్థానం) పై చేరేదానికి సతతమూ ప్రభునామ స్మరణచేస్తూ గడుపుతూ ఉండు.

నీ మనస్సు ఏ మానవ మాత్రుని నామస్మరణయందు లీనం కాకూడదు. ఈ విషయం సర్వదా జాగ్రత్త వహించాలి.

కారణమేమనగా సంసారి చింతనచేసి దానిచేత మనస్సు చెడి పోతుంది. పాపమార్గమువైపు పయనిస్తుంది.

మనస్సును మనము పాపపు దారులనుంచి మరలించాలి.

మనస్సును పాపపుదారుల నుండి మరల్చుటచేత, అది బాగుపడి పరమాత్మనివైపు దారితీస్తుంది.

అందుకని అతిముఖ్యమైన విషయమేమనగా ప్రపంచాన్నిగూర్చి యోచించడము మానుకోవాలి. జగత్తును విస్మరించుటచే మనస్సు ప్రభు స్మరణలో నిమగ్నమౌతుంది. ప్రభువుతోటి ప్రేమ, తన్మయత ప్రాప్తి స్తుంది,

ప్రేమ- తన్మయత్వముచేత జీవితానికి సార్ధకత కలుగుతుంది.

"మనస్సును పరమాత్మని పాదాల ముందుంచడమే—
ప్రభుసేవ."

## 146. అచ్యుతుడు

విష్ణు సహస్ర నామాల్లో వర్ణించిన శ్రీకృష్ణుని అనేక పేర్లలో 'అచ్యుతుడు' ఒకటి.

అచ్యుతుడనగా నాశనము లేనివాడు.

ఎవ్వడు కామమును స్పర్శించుతాడో వాడు నాశనమౌతాడు. ఎవ్వడు కామ వాసనలను స్పర్శించడో వాడు అచ్యుతుడుగా ఆ చంద్రార్కం ఉంటాడు.

కామవాసనల స్పర్శలో ప్రబుద్ధుడైన మానవుడు స్వయముగా స్వస్థానాన్ని, స్వరూపాన్ని పోగొట్టుకుంటాడు.

ఎవ్వడు కామానికి వశముకాడో— వానికి వృద్ధాప్యం పీడించజాలదు, యముడు (కాలుడు) వానికి దాసుడౌతాడు.

సూర్యుణ్ణి చీకటితాక కలుగదే, శ్రీకృష్ణుని కాలుడు స్పర్శించగలదు.కారణమేమనగా శ్రీకృష్ణుడు మహాయోగి, అచ్యుతుడు కనుక !!

"కూడబెట్టడము- పరిగ్రహించడములోనే
నిమగ్నమైనవాడినే జరాసంధుడంటారు."

## 147. దుఃఖముతో దేశము

నేడు మన దేశము దుఃఖముతో ఉంది. ఎందుకనగా, ప్రజలు పరమాత్మని మరచిపోయినారు. ప్రభువుచేసిన ఉపకారాలను మరచిపోయినారు.

దేశము దుఃఖముతో ఉంది. కాని ప్రజలు పాపమన్న భయపడడములేదు, ఎవ్వరైతే ఈశ్వరుని మరచిపోతాడో వారు ఎన్నటికి సుఖించలేరు.

ఎవ్వడైతే సర్వేశ్వరుడుచేసే ఉపకారాలను మరచిపోతాడో వాడికి ఎన్నటికి శుభం చేకూరదు.

పాపమంటే ఎవడు భయపడుతాడో వాని మనస్సు తప్పక శాంతిస్తుంది.

చిన్న అబద్ధం పలికిన లేక చెడ్డకార్యము చేసినా, పాపము అంటుకోదనుకుంటారు. ఏ పెద్ద పాపము చేసినప్పటికి దేవాలయమువెళ్ళి ఏ పదిమందికో నైవేద్యం పంచిపెట్టిన పాపప్రక్షాళనమగునని భావిస్తారు చాలామంది. కాని ఈ బావన సరియైనది కాదు.

పాపానికి ప్రాయచిత్తం చేసుకొని భవిష్యత్తులో పాపకృత్యాలు చేయనని నిర్ణయించుకున్నప్పుడు, పాపాలు భస్మమవుతాయి. సుఖ-శాంతులు ప్రాప్తిస్తాయి.

"ప్రభు సేవతో శాంతి శోభించదు."

## 148. ప్రేమరసం

శ్రీకృష్ణ కథలో అన్నిరసాలు కలిసి ఉంటాయి. ఎవ్వరు ఏ రసాన్ని కోరుకుంటాడో వాడు ఆ రసాన్ని ఆస్వాదించగలడు.

శ్రీకృష్ణ కథకు అంతటి దివ్యశక్తి ఉంది దాన్ని సేవించిన తరువాత మనస్సు ప్రభు చరణాలవైపు ఆకర్షింపబడుతుంది జగత్తులోని అన్ని రసాలలోను తీపిదనం తక్కువ. చేదు ఎక్కువ ఉంటుంది. శ్రీకృష్ణునికి సంబంధిన ప్రేమరసం ఉత్పన్నమైతే జగత్తంతా మధురాతి మధురముగా మారుతుంది.

శృంగారరసం అతిమధురముగా ఉంటుంది. యవ్వన ప్రాయమున అది స్వర్గసౌఖ్యాలను తలంపుకు తెస్తుంది. కాని శరీరము దుర్బలమైనపుడు, వయస్సు ముదిరినపుడు, శృంగార రసము దాగియున్న చేదును బయటపెట్టుతుంది. చివరకు "నేను ఇంతవరకు చర్మాన్ని తుత్తునియలు చేస్తున్నానే"— అనే భావన కలుగుతుంది.

పరమాత్మునికి సంబంధించిన ప్రేమరసమందు అతి మధురముంటుంది. శ్రీకృష్ణుడు ఎవ్వరికి దయతో ప్రేమరసాన్ని దానము చేస్తాడో, వారు జగత్తులోని అన్ని రసాలను తుచ్ఛంగా చూస్తారు. శుక మహర్షిలాంటివారు ఈ రసంకొరకు లంగోటా (కౌపీనం) గూడా వదలడం జరిగింది. కాని శ్రీకృష్ణ కథను విడనాడలేదు. కారణమేమన, శ్రీకృష్ణ చరిత్రలో జగత్తును మరపించి, సమాధి స్థితికి చేరుకునే అలౌకికశక్తి దాగియుంది కనుక !

"రజో గుణమే
కామక్రోధాలకు తండ్రి"

## 149. విలక్షణమైన మాట

ఒక విచిత్రమైన మాట.

మానవుడు ఆర్జించునపుడు చాలా ఏమరుపాటుతో ఉంటాడు.

పుణ్యకార్యాలు చేసేటపుడు అభిమానముతో సందిపోతాడు. తనను గూర్చి తాను ప్రశంసించుకునేదానికి,చాటింపు వేయించుకుంటాడు. ఎంత పుణ్యము తాను ఆర్జించుకుంటాడో అంతకు రెండింతలు పొంగిపోతాడు.

మానవ స్వభావములో పీటవేసుకొని కూర్చున్న ఈ అభిమానము జీవితమనే తొట్టిలో నిండిన, పుణ్యమనే నీటిని ఖాళీ చేయించగల పెద్ద రంధ్రం (బెజ్జం) లాంటిది.

తొట్టిలో ఎంత నిండుగా నీరు నింపినా, రంధ్రం తొట్టిని ఖాళీ చేయించకపోదుకదా ? వానిలోని నీటిని, జల్లెడలో నింపుకొని మనం ఇంటికి రాకలిగితే అభిమానముతో చేసిన సత్కర్మ పుణ్యఫలము పరమాత్మని సన్నిధికి చేరగలదు.

అందుకని నేటినుండి చాలా జాగ్రత్తపడు. జీవితమనే తొట్టికి అభిమానమనే చిల్లి (రంధ్రం) ని తత్కాలితముగా బంధించు ?

బావినుండి నీటిని జల్లెడతో చేదగలమని తలంచవద్దు.

అప్పుడే సత్కర్మ అనేదారి బత్తెం జీవనయాత్రకు సహకరిస్తుంది.

"ఎవ్వనియొక్క జీవితమున లోగం ముఖ్యమవుతుందో—
అట్టివాడు భగవంతుని అల్పంగా భావించి
క్షుద్ర జీవితాన్ని గడుపుతాడు."

## 150. చందనము - గోరింటాకు

తాను సుఖసౌఖ్యాలు అనుభవిస్తూ ఇతరులనూ సుఖింపచేసేవాడు సజ్జనుడు.

తన సుఖంకొరకు నిర్దాక్షిణ్యముగా వ్యవహరించి ఇతరులను దుఃఖితుల చేసేవాడు దుర్జనుడు.

ఎవ్వరైతే ఇతరుల సుఖశాంతుల కొరకు అపారమైన కష్టాలనను భవించి కృషించుతారో వారు, జ్ఞానులు జ్ఞానులు చందనం - గోరింటాకు లాంటివారు.

ఇతరుల సుఖసౌఖ్యాల కొరకు, అలంకారము కొరకు చందనము అరిగిపోతూ ఉంటుంది. అందుకే చందనము జ్ఞానుల నొసటను, పరమేశ్వరుని లలాటముపైనను ఉంచుతారు గోరింటాకును చూడగనే మహిళా మణుల హృదయాలు ఉప్పొంగుతాయి.

చందనము పవిత్రతకు చిహ్నం.

గోరింటాకు (మంగళకరం) శుభానికి చిహ్నంగా ఎంచబడుతుంది.

ఈ చందనము, గోరింటాకును మన అంతర్యమున ఇతరులకు బలిదానము చెయ్యాలనే ప్రేరణను ఉత్పన్నము చేస్తాయి.

"మనకున్న సంసారిక సంబంధాలు మోసం చేస్తాయి. కాని ప్రభుతోటి ప్రేమ సంబంధాలు ఎప్పుడూ మోసము చెయ్యవు."

## 151 తక్షకుడు కాటువేయనున్నాడు

ఎప్పుడో ఒకరోజు 'జీవుని' కాలరూపములోని తక్షకుడు కాటు వేయక మానడు. పరీక్షిత మహారాజు, మృత్యు సమయమున తక్షకునిలో గూడా ప్రభువును దర్శిస్తాడు అదే రీతిన జ్ఞానులుగూడా మృత్యువునకు సుస్వాగతము పలుకుతారు.

ఎవ్వని మదిలో పాపచింతన ఉండదో వానియొక్క మృత్యువు (చావు) మంగళప్రదమౌతుంది. ఏ మానవుడైతే పాపకార్యాలు చేసేటపుడు మృత్యువుకు భయపడుతాడో వాని జీవితము మరణము రెండూ చెడిపోతాయి, అంత్యకాలమున భయము కలుగడము కాలునితో కాదు. తాను చేసిన పాపకార్యాలచేత.

మానవుడు పాపకార్యాలు చేసేటపుడు భయపడడము లేదు. కాని పాపకార్యాల ఫలితముగా శిక్షను అనుభవించే సమయమాసన్నమైనపుడు భీతి చెందుతాడు. అప్పుడు భయపడి ప్రయోజనమేమిటి? పాపకృత్యాలు సలిపేటపుడు భయమనేది కలుగుతే పాపకార్యాలు చెయ్యగలమా?

వ్యవహారిక జీవితమున మనము ఇతరుల భయముచే చక్కగా వ్యవహరిస్తాము, (నడచుకుంటాము) కాని ఈశ్వరుడున్నాడని తలంచము.

నియమానుసారము ఎవడు నడచుకుంటాడో వాడు ప్రభుత్వానికి వెరవడు. అదేరీతిన ఈశ్వరాజ్ఞానుసారము జీవితాన్ని గడిపేవాడు కాలునికిగూడా భయపడడు.

"కామితోటి స్నేహం చాలా ప్రమాదం.
వానికి దూరముగా ఉండు.

## 152. మహాత్మునివి కావాలి

ప్రతి గ్రామమందును ఒకరో- అర్ధమో మహాత్ములుంటారు.

సమాజమున మహాత్ములే లేకుంటే సమాజానికి మనుగడ ఎక్కడిది ?

కాని మహాత్ములే లభించకుంటే వారికొరకు పరుగుతీసి వెదుకుట కంటే జీవితాన్ని పవిత్రము చేసుకొని నీవే మహాత్మునివై పో.

మహాత్మునివైతే నీ కొరకు నిజమైన మహాత్ముడు వెదకుతూ నీ చెంతకు పరుగులుతీస్తూ వస్తాడు.

మహాత్ముని జీవితము అత్యంత సహనశక్తి కలిగియుంటుంది.

ఎవ్వడు సహించడము నేర్చుకుంటాడో వాడే మహాత్ముడౌతాడు.

సామాన్య మానవుని మనస్సు క్షణక్షణమూ మారుతూ ఉంటుంది కాని జ్ఞానియొక్క మనస్సు సర్వవేళలా శాంతముతో స్థిరముగా ఉంటుంది.

మానావమానాలయందు, లాభ నష్టాలయందు, సుఖ దుఃఖాల యందు ఇత్యాది విషాదకర పరిస్థితులయందును మహాత్ముడు సౌమ్యంతో స్థితప్రజ్ఞుడుగా ఉంటాడు.

నీవు అలాంటి మహాత్మునివి కావాలి.

"సత్కర్మ ప్రేరేపణ కొరకు
పిల్లలచేత సత్కర్మ చేయుంచు."

## 153. స్వచ్ఛత - పవిత్రత

నేడు పవిత్రతకు విలువలేకుండా పోయింది.

చాలామంది స్వచ్ఛతనే పవిత్రతగా భావిస్తారు. కాని స్వచ్ఛతకు పవిత్రతకు చాలా తేడా ఉంది.

తన ఇష్ట ప్రకారము చేసిన శుద్ధిని స్వచ్ఛత అనబడుతుంది. జ్ఞానులు శాస్త్రప్రకారము చేసిన శుద్ధిని పవిత్రతగా భావిస్తారు.

మల విసర్జనానంతరము సబ్బుతో చేతులు కడుగుకొనడము స్వచ్ఛత అనబడుతుంది. కాని పవిత్రత అనిపించుకోదు.

మలవిసర్జనానంతరము మట్టితో చేతులు కడిగి తరువాత స్నానం చేసినపుడే పవిత్రత అనిపించుకుంటుంది.

స్త్రీలు పాత్రలు స్వచ్ఛంగానే (పరిశుభ్రంగానే) ఉంటాయి. కాని పవిత్రముగాగాని లేక ఆరోగ్య ప్రదాయినిగా కాని కావు.

జ్ఞానులు, శాస్త్రిలు, సూచించిన ప్రకారము చేసిన శుద్ధియే పవిత్రతగా ఎంచబడుతుంది.

"ప్రతి ఇంద్రియ ద్వారముకడ
ప్రభువును ప్రకాశింపజెయ్యి."

## 154. రెండు పర్వతాలు

బద్రినారాయణ క్షేత్రం దర్శించేందుకు యాత్రచేస్తే దారిలో మనము 'జయ'- 'విజయ' అనే పేరుగల రెండు పర్వతాలు దాటి వెళ్ళాలి. ఇవి దాటడము చాలా కష్టం.

ఈ రెండు కొండలు దాటిన తరువాతనే మనకు నారాయణుని దర్శనము కలుగుతుంది.

స్వదేశములో లభించే ప్రతిష్ఠ 'జయ' అని అనబడుతుంది.

విదేశములో లభించే ప్రతిష్ఠ 'విజయ' అని అనబడుతుంది

ఈ రెండింటి నుండి బయటపడడము చాలా కష్టం. కామము, ధనము, రెంటిని త్యాగము చేసేవారుగూడా కీర్తిని త్యాగం చెయ్యలేరు.

గృహస్థునికి ధనాన్ని, కామ సుఖాలను వదలడము ఎంతకష్టమో సాధువు మాన ప్రతిష్ఠయొక్క మోహాన్ని వదలడము అంతకంటే కష్టం.

ఇల్లువదలి అరణ్యం వెళ్ళే సాధువువెంట మానప్రతిష్ఠ అనెడి భూతం వెంబడిస్తుంది. సాధనకొరకు ప్రపంచాన్నే వదలిన సాధువు గూడా సిద్ధి- ప్రసిద్ధివెంట పరుగులు తీస్తాడు.

ప్రపంచాన్నే వదలిన సాధువునకు శిష్యులు, శిష్యురాండ్రు పెరిగి పోతారు. అప్పుడు మరలా ప్రపంచంలోకి రావలసివస్తుంది. ఒకటి ఒకటి వదలుకొని, మరొకదానిలో చిక్కుబడిపోతే మరి సాధించేదేమిటి ?

"ప్రతినిత్యము కొద్దికొద్దిగా
చావుకు సిద్ధపడుతూ ఉండు."

## 155. ఇల్లు - ప్రభు మందిరము

నేటి మానవుడు ఇల్లు వదలలేకున్నాడు. ఇంట్లో శాంతిని పొంద లేకుండా ఉన్నాడు. పరివారములో పిల్లలు మాట వినడము లేదు. ఇంత పెద్ద బాధలు అనుభవిస్తూ మానవుడు గృహం వదలడము లేదు.

గృహముపై వ్యామోహంగల మనుజుల కళ్యాణార్థం భాగవతము చెప్పబడింది.

కలియుగ మానవులు జ్ఞానాన్నిగూర్చి మాట్లాడుతారు. కాని ఆచ రణ అంతంత మాత్రమే. సంసార సుఖాలలోనే మాధుర్యం కలదని భావిస్తారు. ఇల్లు వదలి బ్రహ్మ చింతనలో మనస్సు లగ్నం చెయ్యరు. చుట్ట, సిగరెట్టులను వదలలేని మానవులు, గృహాన్ని ఎట్లా త్యజించ గలరు. అట్టి పరిస్థితుల్లో మానవుని మంచి మార్గములోనికి తెచ్చేదానికి భాగవతము ఏమి చెప్పతుందంటే— "నీవు ఇల్లు వదలవద్దు. కాని ప్రతి వస్తువును ప్రభువుకు సమర్పించి ప్రసాద రూపములో గ్రహించుటవలన కర్మబంధం నిన్ను బంధించజాలదు." అని చెపుతుంది.

సర్వస్వమూ నీవు త్యాగము చెయ్యలేవు. కాని నీ గృహాన్ని పర మేశ్వర మందిరముగా భావించు.

"ఈ గృహం నీది కాదు. ప్రభు మందిరం. దీని యజమాని పర మాత్మడే." అనే భావన కలిగి ఇంటిపై వ్యామోహము లేకుంటే ఏ పాపము నిన్ను అంటుకోదు.

"ప్రతి ఇంద్రియాన్ని భక్తి శ్రద్ధలతో గమనిస్తే—
పాపాలనుండి రక్షింపబడుతావు."

## 156. పాపానికి శిక్ష

ఏ జీవిపై పరమాత్ముని కృప తొలగిపోతుందో, ఆ జీవి పాపానికి శిక్ష త్వరగా లభిస్తుంది. ఎవ్వనిపై పరమాత్ముని కృప తక్కువగా ఉంటుందో, వాని పాపానికి దండన కాస్తా ఆలస్యముగా ప్రాప్తిస్తుంది.

పాపకృత్యాలు చేసేవాడు నేడు సుఖజీవితము గడిపినట్లు కనిపించినా, రేపు వాడు పాపఫలమును అనుభవించవలసినపుడు చాలా బాధపడిపోతాడు.

పాపాత్ముడు నేడు సుఖంగా ఉన్నట్లు అగుపించినా, అది నేడు వాడుచేసిన పాపఫలంకాదు. అది పూర్వం చేసిన కార్యఫలితమే, వాడు సుఖించేదానికి కారణం ఎప్పుడైతే వాని పుణ్యఫలం పరిసమాప్తమౌతుందో— అప్పుడు పాపఫలం అనుభవించవలసి ఉంటుంది. అప్పుడు వాడు ఏడ్వనుగూడా, ఏడ్వజాలడు.

ఎప్పుడైతే పాపానికి శిక్ష రూపమున దుఃఖ దవానలము ప్రజ్వరిల్లుతుందో, అప్పుడు అర్థమయ్యేదేమంటే "అపారమైన ప్రభుకృప నీ పాపాలను దహించి వేస్తుందని."

పాపాలుచేస్తూ ఉన్ననూ సుఖస్రవంతి తొనుకుతూ ఉంటే అప్పుడు తెలుసుకో? "పుణ్య నిధి దగ్గమౌతూ ఉంటే నేను ఏ మరుపాటున ఉన్నానే"— అని.

అందుచేత పాపానికి శిక్షననుభవించేదానికి సర్వధా సిద్ధంగా ఉంటే జీవితానికి సిద్ధి ప్రాప్తిస్తుంది.

"జీవితములో మెల్లమెల్లగా నిగ్రహశక్తిని పెంచుకొని
భక్తి అలవరచుకుంటే పరమాత్ముడు తప్పక వశమవుతాడు."

## 157. అభేద భావము

తల్లీ-కుమార్తెల హృదయాలు ఒకటిగానే ఉంటాయి. కనుకనే ఒకరిపై మరొకరికి కినుక. భయము ఉండదు, కాని అత్తా కోడండ్రు ఒకే ఇంటిలో సర్వదా కలిసి తిరిగినా, వారి మనస్సులు వేరు-వేరుగా ఉంటాయి. అందుకే వారిరువురిమధ్య పరస్పరం భయం, అనుమానాస్పదమైన వాతావరణం ఆవరించి యుంటుంది

కాని ఈ అత్తా-కోడల్లు తల్లీ-కుమార్తెలవలె, భేదభావము పాటించక ప్రేమ భావముతో మెలిగితే ఒకరిపై మరొకరికి భయము ఉండదు,

ఎక్కడ బేదభావము ఉంటుందో, అక్కడ భయముంటుంది.

ఎక్కడ భేదభావము కనిపించదో, అక్కడ భయము కనిపించదు. పరీక్షిత మహారాజు తనను కాటువేయ వచ్చే తక్షకునియందు పరమాత్మని దర్శించి అభేద భావాన్ని చాటినాడు. కనుకనే ఆయనకు ఇంకెవరితో భయముంటుంది ? ఎందుకుంటుంది ?

శుక మహర్షి ముఖతా భాగవతాన్ని వినిన తరువాత పరీక్షితుని హృదయమున ఈ భావము ధృఢముగా నాటుకుంది. "నా భగవంతుడు అందరిలోనూ ఉన్నాడు. ఆయన ఏమిచేస్తాడో, నామేలు కొరకే చేస్తాడు. కావున నాకు భయమెందుకు ? ఇంక అనుమానమెందుకు."— అని అనుకుంటాడు.

"కుమారులకు వివాహము జరిగి కోడండ్లు ఇంటికి వచ్చినచో అప్పుడు వానప్రస్థాశ్రమము స్వీకరించు."

## 158. పాపకార్యాయములలో ఏకాగ్రత

పుణ్యకార్యాలు చేసే మానవుడు అభిమానముతో నిండిన మనస్సుతో ఏమరుపాటు కలిగియుంటాడు. పాపకృత్యాలు సలిపేటపుడు చాలా జాగ్రత్తగా ఉంటాడు. తానుచేసే పని ఎవరైనా చూశారా, ఏమి? లేక పట్టుబడతామా ఏమని? యోచిస్తాడు. ఈ రీతిన వాని జీవితమంతా పాపకార్యాలు చేసేదానికే నిమగ్నమై యుంటుంది.

అందుకే వాని పాపకర్మ అత్యంత బలవత్తరముగా ఉంటుంది

అందుకే వాని పాపకర్మ గంభీరమైన ఫలితమునిస్తుంది.

అందుచేత వాని పాపము జీవితాన్ని సర్వనాశనం చేసేదానికి సిద్ధపడుతుంది.

కనుక ఆ పాపమునుండి రక్షించుకో.

మనస్సు జాగృతావస్థలోనున్ననూ అటువంటి పాపాలు చెయ్యకు. తెలియక ఏదైనా పాపంచేస్తే పరమాత్మునిచెంత నిలుచొని క్షమాభిక్ష పెట్టమని ప్రార్థించి ప్రభు చరణాలయందు పాపాలనన్నింటిని సమర్పించు. పరమాత్ముడు చాలా ఉదారుడు. నీకు తప్పక పాపవిముక్తి కలిగిస్తాడు.

ఐతే. షరతు ఏమిటంటే— "ఇంక భవిష్యత్తులో నా చేతులతో గాని, కన్నులతోగాని లేక నాలుకచే గాని, ఏలాంటి క్రొత్తపాపాలు చెయ్యనని ధృఢ సంకల్పముతో ఉండాలి.

"ప్రభువును ప్రసన్నంచేసే ప్రవృత్తిని ఆచరించు."

## 159. దేవుని ఉపకారము

మహాభక్తుడు ఏకనాదుని భార్య ఆయనకు చాలా అనుకూలవతి. అందుకని ఏకనాధుడు సంతోషముతో ప్రభువుకు విన్నవించుకుంటాడు. "హే భగవాన్! నాయందు దయతలచి నా ఇంటిలో మంచి సత్సంగాన్ని ఏర్పాటు గావించావు. కనుక నా హృదయము ఎల్లప్పుడూ పరమాత్ముని వైపు పరుగులుతీస్తూ ఉంది." అని అంటాడు

తుకారాం భార్య కర్మవశాత్తు ఆయనకు ప్రతికూలమైనపుడు సంతోషముతో ఆయన ఇట్లా అంటాడు "హే ప్రభూ నాకు ఇంటిపై వ్యామోహము లేకుండాచేసి సద్గుణవతిని పత్నిగా చేసి నాపై నీవు ఎంతో కృప చూపుచున్నావు. అందుకనే నా మనస్సు ఇంటికి వెళ్ళాలనిగూడా లేదు. ఎల్లప్పుడు నీ సాన్నిధ్యమందే గడపాలని ఉంది నాకు." అని అంటాడు.

నరసింహమెహతా భార్య స్వర్గస్థురాలౌతుంది, ఆయన ఏకైక పుత్రుడు "షామలషాహ" కూడా మరణించడముతో వంశోద్ధారకుడనే వాడూ లేకుండా పోతాడు ఐననూ భక్తుని హృదయమునుండి సంతోషకరమైన వాక్యాలు వెలువడుతాయి. "హే భగవాన్? నా జంజాటాన్ని తొలగించి చాలా ఉపకారము చేశావు నాకు. ఇంక హాయిగా నీ భజన చేసుకుంటాను గోపాలా!" అని అంటాడు. ఎంతవారు ఇట్లా పలుకుతారు? సందేహమే.

క్లిష్ట పరిస్థితుల్లోగూడా ప్రభుభక్తులు ఉపకారాన్ని చూడగలుగుతారు,

వారి మనస్సులు, పత్ని అనుకూలమైనా ప్రతికూలమైనా, సంసారము చితికిపోయినా, అంతా ప్రభుచేసిన ఉపకారమేనని భావిస్తారు.

"పరోపకారము చేయునపుడు మనసులో
అభిమానము ఉండకుండా జాగ్రత్త వహించు."

## 160. అంతిమ ఘడియలో

మానవుని అంత్యకాలము చాలా కష్టాలతో నిండియుంటుంది. ఆ సమయములో, మునుపు తీర్థమున దర్శించిన స్వామిరూపము, లేక పుణ్యకార్య స్మరణ కలిగితే జీవునికి శాంతి లభిస్తుంది

అట్లుకాక ఆ సమయములో "పాపం" జ్ఞాపకానికి వస్తే భయ భీతిచే జీవుడు కలత చెందుతాడు. అప్పుడు వాని వేదన చాలా తీవ్రముగా ఉంటుంది.

ఎప్పుడు మానవుడు పుణ్యకర్మ చేస్తాడో, అప్పుడు అభిమానముతో నిండి చేసిన పుణ్యం కాస్తా మరచిపోతాడు. అంత్యకాలములో ఏమరుపాటున చేసిన పుణ్యకార్యాలు జ్ఞాపకానికి రావు.

అప్పుడు వానికి ఏకాగ్రతతో శ్రద్ధగా చేసిన పాపకృత్యాలే జ్ఞాపకానికి రావడంచేత భీతి చెందుతాడు. శాంతిని కోరవిడుచుకుంటాడు.

ఆ పరిస్థితుల్లో ఈశ్వర నామస్మరణమే మృత్యువు నుండి కాపాడుతూ అంత్యకాలమున స్నేహితునిగా ఉంటుంది.

భాగవతము ప్రభు ప్రేమను జాగ్రతపరచి జీవుని పరమాత్మని వైపు మళ్ళించి అంత్యఘడియలను కష్టాల నుండి కాపాడుతుంది.

"ఉదయమే సూర్య నమస్కారము చేస్తే
తనువు మనువు రెండూ బాగుపడతాయి."

## 161 అందరూ పరమాత్మ స్వరూపులే

జ్ఞాపకముంచుకో ! నీ మాటలు వినేదానికి పరమాత్ముడు ఏదో ఒక రూపమున నీ వాకిలి ముందుకు వస్తాడు.

ఆయన ఒక దరిద్ర నారాయణ రూపముతోనో, బ్రాహ్మణవేషముతోనో దుఃఖాబాధితుని రూపముతోనో నిన్ను కలిసేదానికి వస్తే వారిని ఉపేక్షింపక, దుర్భాషలాడక ఇంటినుండి వెడలకొట్టకు. లేకుంటే ప్రభు కోపముతో మరి ఇంకెప్పుడు నీ వాకిలిముందు నిలువడు.

నీవెప్పుడైనా పరమాత్ముని వాకిలిముందు నిలుస్తే నిన్నూ ఆయన దుర్భాషలాడి బయటకు పంపించివేస్తాడు.

అందుకని ఈ జగత్తులో ఏది కనిపిస్తుందో అది పరమాత్మ స్వరూపముగా భావించి వివేకముతో సద్భావనముతో జీవితాన్ని సాగించాలి. ఎవరిని ఎప్పుడుగూడా తిరస్కార భావముతో మాట్లాడవద్దు.

ప్రతియొక్కని ఎదుటకు ప్రభు ఏదోఒక రూపములో ఒకటి, లేక రెండుమార్లు తప్పక వస్తాడు. కానీ ఆ సమయమున జీవుడు ఏమరుపాటుతో ఉండడము జరుగుతుంది. ఎదురుగా పరమాత్ముని గుర్తించజాలడు.

"నేటినుండి నేను క్రొత్త పాపాలు చెయ్యను"

## 162 ప్రభువుకు దాసుడు

ఎంత విపత్కాలమొచ్చినా, పర్వతమే వచ్చి మీదపడినా, మరి ఏమైనాసరే భగవంతుని భక్తుడు నిరుత్సాహపడడు.

వాడు నిరుత్సాహపడితే ప్రభు దాసుడని ఎట్లా అనిపించుకుంటాడు?

ప్రభుభక్తుడు ప్రభు సాన్నిధ్యమున ఆనందముగా, ఉల్లాసముగా ఉంటాడు.

సుఖము కలుగుతే అభిమానముతో గర్వపడడు దుఃఖము సంభవిస్తే నిరాశతో కుమిలిపోతాడు.

"నా ప్రభువు ఏమిచేసినా నా మేలుకొరకే చేస్తాడు. పరమాత్ముని ఒడిలోనున్న నేను ఎందుకు చింతించాలి!" అనే భావన వాని హృదయమున ఉంటుంది.

ఎవని హృదయమున ఈలాంటి భావన కలుగుతుందో, వాడు ప్రభువుకు దాసుడు- అనబడుతాడు.

అట్టి వైష్ణవునియొక్క మనస్సు సర్వదా శాంతిని పొందగలుగుతుంది.

"కొత్త విషయము యోగ్యమైనదైతే వివేకముతో గ్రహించు.
కాని పూర్వపు విషయాలను మాత్రము ఒకేసారి వదలకు ?"

## 163. భక్తుని జీవన మంత్రం

నిజమైన భక్తుడు తన హృదయములో పరమాత్మని శ్రద్ధగా నిలుపుకుంటాడు.

ఏ విషయమైగూడా అతని అంతరంగమున దుఃఖము (అసంతోషము) బాధించదు. 'వలానా వస్తువు లేదే' అనే భావనగూడా కలుగదు.

"నా ప్రభువు నాపై అపారమైన కృప చూపుచున్నాడు. అది నా భాగ్యముకాక మరేమిటి ? ఒకవేళ నాకు ప్రభువు దుఃఖము కలిగించినా, అది నా మేలుకోరియే చేస్తున్నాడు"— అని అనుకుంటాడు.

ఆ భక్తుడు పరమాత్మ చేసే ప్రతి కార్యాన్ని, పద్ధతిని, విధానాన్ని, ప్రేమపూరిత దృక్కులతో చూస్తాడు.

వానికి పుత్రుడు కలిగినా, కలుగకున్నా, ఆనందాన్ని అనుభవిస్తాడు. ఒకవేళ పుత్రుడు మరణించినా, ఆనందిస్తాడు.

"అంతా మన మంచికే. ఆహా ఇదంతా మన మంచికే"— ఇది ఆ భక్తుని జీవన మంత్రం.

"నేటినుండే నేను
పరమాత్మని అనుసరిస్తా"

## 164. రెండువైపులా దుఃఖాలు

నేటి మానవుడు శరీరముతో, ఇంద్రియాలతో కలిగే సుఖాలే నిజమైన సుఖాలను కొంటూ ఉన్నాడు.

అందుకని ఆ సుఖాల పొందేదానికి కాల్లు-చేతులు బలహీనపడినా అనేక రకాలైన అసహ్య కార్యకలాపాలు సాగిస్తూనే ఉంటాడు. సదాచారము నిగ్రహము త్రోచిపుచ్చుతాడు,

కానీ నిగ్రహాన్ని, సదాచారాన్ని ఉపేక్షించి కోట్ల రూపాయలు ఆర్జించేవారికి నిజమైన శాంతి సౌఖ్యాలు ఎట్లా లభిస్తాయి ?

తప్పుదారిలో పయనించి కోట్లకు పడగలెత్తినా, నిజమైన శాంతి ఎట్లా ప్రాప్తిస్తుంది.

అందుకే ఈ ప్రపంచమున చాలామంది ఏ కొంచెము సంపాదించినా, దుఃఖితులగుచున్నారు. కోట్లకు కోట్లు సంపద కూడబెట్టినా, దుఃఖము తప్పటంలేదు.

కొందరు కడుపునిండా తింటే దుఃఖపడుతారు, కొందరు కడుపు నిండక బాధపడుతారు.

అజ్ఞానముతో కొందరు దుఃఖాన్ని అనుభవిస్తే కొందరు జ్ఞానముతో అభిమానము పెరిగి దుఃఖితులవుచున్నారు. అంతే తేడా !

శక్తిని బుద్ధిని సదుపయోగం చేస్తే
పైకమే కాదు. పరమాత్ముడు ప్రాప్తిస్తాడు.

## 165. అంధకారి

భాగవతమున ఈకథ వస్తుంది ఐదుగురు వేశ్యలు వ్యభిచారియైన 'అంధకారి' యొక్క ధనాన్ని దోచుకొని చివరికి అతనిని చంపివేస్తారు. ఆ అంధకారికి ప్రేతయోని ప్రాప్తిస్తుంది. వాడిని ఉద్ధరించేదానికి గోకర్ణుడు ఏడు దినాలు భాగవతాన్ని వినిపిస్తాడు.

కథా స్థలమున వెదురుకొయ్య యొక్క కణుపులు ఒక్కొక్కటే తెరుచుకుంటాయి. ఏడవ దినము అంతిమ కణుపు విచ్చుకుంటూనే ఆ అంధకారి ఉద్ధరింపబడుతాడు.

ఆ అంధకారి ఐదుగురు వేశ్యల రూపమున ఉన్న విషయాలలో చిక్కుకొని యున్నాడు. ఆ ఐదు విషయాలు మానవునియొక్క ఆత్మ ధనాన్ని దోచుకుంటాయి, అంధకారితో సమానముగా మనుజునికి ప్రేత యోని ప్రాప్తిస్తుంది.

వాసనలనే ఏడు కణుపులు జీవుని బంధించివేస్తాయి. పతి, పత్ని పుత్రుడు, వృత్తి, పరివారము, పదవి, పైకము, అను ఈ ఏడు వాసనలనెడి కణుపులు (ముడులు) తెంపబడజాలవు. వివేకముతో మాత్రమే అవి విచ్చుకుంటాయి. అందుకొరకు ప్రేమతో ప్రభునామమును జపించి జీవితాన్ని పరమాత్మమయము గావించు. మెల్లమెల్లగా కణుపులు (ముడులు) విచ్చుకుంటాయి.

"ప్రపంచాన్ని విస్మరించగలిగితే
బ్రహ్మతోటి సంబంధం స్థాపించుకోవచ్చు"

## 166 కణము - క్షణము

సాధువుకు కణము, క్షణము రెండూ విలువైనవే. అందుకనే ఈ రెంటిని విలువైనవని తలచి ఎవరు వినియోగించుకుంటాడో- వాడే నిజమైన జ్ఞాని!

జ్ఞాని కణమును-క్షణమును ఉపేక్షించడు.

ఎందుకనగా ఒక చిన్న తునక అన్నపు మెతుకునుగూడా చీమకు కడుపునింపగలదు. ఇంకో చిన్న కణము అనేకమంది వ్యక్తులను ఉద్ధరించగలదు.

అందుకని జ్ఞానులు ప్రేమ పూర్వకముగా చెపుతారు, "జీవితమున ఒక క్షణముగూడా వ్యర్థపరచవద్దు. ధాన్యపు కణాన్ని ఒక్కదానినిగూడా పారవెయ్యకు" అని.

ఎవ్వడైతే కణాన్ని, క్షణాన్ని, చక్కగా ఉపయోగించుకుంటాడో, వాడే సజ్జనుడు. (ఉత్తమ పౌరుడు) ఎవ్వడు ఈ రెండింటిని దురుపయోగము చేస్తాడో, వాడు దుర్జనుడు.

"ఉత్సవము ప్రసాదముకొరకు తన్మయమయేందుకు కాదు,
పరమాత్మునిలో తన్మయమయేందుకు !"

## 167. శ్రవణము - మననము

భాగవతము కేవలము కథవినే వస్తువుకాదు. (పదార్థము కాదు)

అది విన్న తరువాత సతతము మనస్సుద్వారా హృదయములో భద్రపరచి, ఆచరణలో నుంచవలసిన పదార్థము

భాగవత కథ మరణించిన తరువాత విముక్తిని కలిగించేదే కాదు. మృత్యువుకు పూర్వము గడిపిన జీవితమునగూడా ముక్తియొక్క ఆనందాన్ని, అనుభవించే దానికిగూడా అది ఒక సాధనము.

కథ విన్న తరువాత విరామ సమయమున బాగుగా తిని, (అరగించి) విశ్రాంతి తీసుకునేది కాదు. సాత్విక జీవితము గడిపి, భాగవతాన్ని శ్రవణం చేసిన తరువాత మననము చేసుకునేదానికి ఆయత్తులవ్వాలి.

కథ విన్న తరువాత ఆ సిద్ధాంతాలు సర్వదా మననము ద్వారా హృదయమున స్థిరపడి కథలోని జ్ఞానము క్రియారూపములోనికి తెస్తే సార్థకముంటుంది.

"వక్త - శ్రోతల తన్మయత్వమున ఆటంకము
కలిగించువారికి మహాపాపం అంటుకుంటుంది "

## 168. ఆత్మదేవుడు

ఆత్మహత్య చేసుకోవలయునని ప్రయత్నమందున్న ఆత్మదేవు నకు సంతోషం కలిగించాలని ఎన్నో ఉపదేశాలు చేసిననూ ప్రయోజనము లేనందున నారద మహర్షి, ఆతనిపత్నికి ఒక ఫలము నివ్వడము జరుగు తుంది. నిర్లక్ష్యభావంగల ఆదుందులి ఆ ఫలమును ఆరగించక తన చెల్లి లికి అప్పగించి, చెల్లెలి కుమారుని నేనే కన్నానని ఆత్మదేవునికి తెలియచేసి మోసపుచ్చుతుంది.

ఆ కుమారుడు దురాచారపరుడు, అహంకారి. తత్ఫలితముగా తండ్రికి అకాల మృత్యువు ప్రాప్తిస్తుంది. తల్లి ఆత్మహత్య చేసుకోవలసి వస్తుంది.

ఆత్మదేవుడు తుంగ భద్రానదీతీరాన ఉంటూ ఉండేవాడు. 'తుంగ భద్ర' అనగా చక్కగా శుభమును కలిగించే ఏర్పాట్లుగల మానవ కాయ మని అర్థం.

దుర్లభమైన మానవకాయము తీరమునకు ఆత్మదేవుడు కావడము జరిగింది. సద్గతి పొందేదానికి. కాని చంచలబుద్ధిగల ధుంధులిని, వివా హం చేసుకోవలసి వచ్చింది. ఫలస్వరూపముగా వివేకమనే, పుత్రుడు కలుగలేదు. అందుకని దుఃఖము పెరిగిపోయింది.

సర్వదా సత్సంగము నిర్వహించేవారికి వివేకమనెడి పుత్రుడు ఉదయిస్తాడు. బుద్ధిని వశపరచుకునేవారు. విషయ వాసనలకు లోనైన మనుజులు చివరికి ఏడ్వవలసి వస్తుంది.

